# కూలిపోయే కొమ్మ

(వచన కవితల సంపుటి)



'వాచస్పతి'

డాక్టర్ వానమామలై వరదాచార్యులు.

# Koolipoye Komma

By Dr. Vanamamalai Varada Charyulu

ప్రచురణ :

1977, దీపావళి

ముఖపత్ర రచన :

శ్రీ కొండపల్లి శేషగిరిరావు.

ముద్రణ :

దక్షిణభారత ప్రెస్,

ఖైరతాబాదు, హైదరాబాదు-500 004.

వెల : రు. 4-[illegible] = 00

ప్రతులకు :

వానమామలై వరదాచార్యులు

పోస్టు : చెన్నూరు

జిల్లా : ఆదిలాబాదు.

## కృతి కర్త



శ్రీమాన్ వానమామలై వరదాచార్యులు

## కృతి స్వీకర్త



ఆంధ్ర ప్రదేశ ప్రభుత్వ ఆరోగ్య శాఖా మాత్యులు
మాన్యశ్రీ కోదాటి రాజమల్లు గారు

# అంకితము

ఆంధ్రప్రదేశారోగ్యామాత్యవర్య ! రాజమల్లు !
ఆర్యా ! మీప్రతిభ గాంచ ననర్ఘ రత్న మన జెల్లు
సుందరమగు సూక్తి యదొక సుమధు రామృతపు జల్లు
చక్కని మీ జీవితమే సకల సుగుణముల కిల్లు-

చిన్న కుటుంబమున బుట్టి చీకటులను బాపుటకై
వన్నెమీరు మణి దీపము వైనా వాంధ్రావనికై
చెన్నూరు నియోజక వర్గమ్ము నుండి యెన్నికయై
ఎన్నో సేవలు జేసితివన్నా మానవతకునై

ఐదుమారు లెన్నికలందద్భుత విజయము నిలిచెను
ఆ నీ విజయము గని ని న్నమాత్య పదవియె వలచెను
రాజ పేరి మల్లుడవై రాణించుటనో యేమో ?
రాజమల్లుడను పేరిట రాజిల్లితివా స్వామీ।

నీ హృదయము నిర్మలము-నీ వర్తన నిస్వార్థము
ప్రజా సేవయే నీకిల పరమార్థపు సాధనము
అల జనతా జనార్దనుడె యారాధించే దైవము
ప్రజ సేవకు ముడుపు గట్ట బడిన సొమ్ము నీ దేహము

మహాత్ముడే నీకు పిత, మన జవహరు నీభ్రాతా
ఇందిర సమైక్య పథముల కిడితివి తలవంచి జోత
ఘనతర ప్రజా సుఖమ్మే కడుపు నింపు నీ మేత
అందుకె నీ కీర్తి యావదాంధ్రమునన్ ప్రోగె మోత

తెలగాణాధ్యక్షుడవై తెచ్చితి వెంతయు కీర్తి
అలఘుత రామాత్య పదవి వెలిగితి స్వేచ్ఛా మూర్తీ
సువిదిత మానవతా వాదివి విజ్ఞాన స్ఫూర్తీ
దళితజన సముద్ధారక దయారాజ్య చక్రవర్తీ.

నయ విద్యా చాతుర్యా! న్యాయాచరణాచార్యా!
జయము మంత్రి మాణిక్యా। జయము నీతి చాణక్యా!
జనహిత కార్యాచరణము జయ మొందుత రాజమల్లు
అందరి మెప్పును బడయుట లది నీ ప్రతిభకె చెలు॥

సరసుడు గుణవంతుండని సత్యవర్త నుండనుచును।
నా కవితా సుందరి నిను నాధునిగా నెద వలచెను
రసవతి యీ కవితాసతి రమ్యవర్ణ సద్గుణవతి
స్వీకరింపు మీ సత్కృతి శ్రీ కరము యశస్కరమ్ము–

# మరో మలుపు

డా॥ సి. నారాయణరెడ్డి

'నేను కవిని నా గేయం అహింసా క్రాంతి
నా ధ్యేయం విశ్వశాంతి.'

'అభినవ పోతన' పునరభినవంగా, సమ కాలానుగుణంగా ప్రవచించిన పంక్తులివి. వీటికి ఉపశ్రుతికంగా ఉన్న పంక్తులు-

'నేను హంసను పరమహంసను
దౌర్జన్యంపై దాడి వెడలిన అహింసను.'

కవి బుద్ధికి హంస ముక్కుంది. కవి భావుకతకు నేల రాలని వాన చినుకులను అందుకునే చాతకం నోరుంది. కవి హృదయానికి ఎలాంటి సాదా విషయాన్నైనా అమూల్యంగా మలచుకోగలిగిన శుక్తిగర్భముంది.

'అభినవ పోతన' ముమ్మూర్తులా కవి. మహాకవి. ఆయనలో పైన చెప్పిన గుణత్రయి పరమ పాకంలో ఉన్నాయి. అందువల్లనే 'పోతన చరిత్రము' వంటి మహాకావ్యం రచించినా, 'మణిమాల', 'విప్రలబ్ధ' వంటి పద్య గీతాత్మక లఘుకృతులు సంతరించినా, 'వైశాలిని' వంటి నాటకం నిర్మించినా-ఇప్పుడీ వచన గంధి కవితా సంపుటి వెలువరించినా-ఆయన వాక్కు సదా ప్రౌఢ కవితా స్పృక్కు; పదశాబల్య భాక్కు.

కవిలో హంసత్వమూ, 'పరమహంసత్వ'మూ ఉంటాయి. మొదటిది వివేచనా పరం. రెండవది సంయమనపరం. వివేచనతో, సంయమనంతో ప్రస్థానించే కవి దౌర్జన్యంపై దాడి వెడలుతాడు.

కత్తులతో కాదు పడవతిప్పని వచశ్శక్తులతో. అప్పుడు పశుత్వ కొమ్ములు వంచుతుంది. రాక్షసితనం నెత్తురు కక్కుకుంటుంది. ఇదే 'అహింసా క్రాంతి' అంటే.

'నా గేయం అహింసా క్రాంతి' అంటే—తన పాట అహింసా క్రాంతి అని కాదు; తాను రచింపదగింది అని-ఆ 'గేయం'లోనే ఒక ధ్యేయం, ఒక లక్ష్యం ఇమిడివున్నాయి ఈ సంపుటిలో అక్కడక్కడా వికీర్ణంగా ఉన్న సామాజిక చేతనా దృక్పథాలన్నీ పై పంక్తిలో ధ్వనిస్తున్నాయి.

ఈ సంపుటిని చదివిచూస్తే ప్రాయికంగా కనిపించే భావధారలు మానవత, మమత, శాంతి, సమత చీకటిని ఊరితీయాలనే తపన, సార్వభౌమత్వం పెళ్లగిలిపోవాలనే సామ్యభావన, అధికార మదాంధత అడుగంటి పోవాలనే ఆందోళన ముమ్మొనల్లా మెరుస్తుంటాయి ఈ సంపుటి నిండా

వరదాచార్యులుగారు సాధించిన రచనా ప్రక్రియల దృష్ట్యా ఈ ప్రయత్నం కొత్త మలుపు, వారు పద్య విద్యలో ఎగిసిన యెత్తులు— అవిగో చెబుతాయి ఆ ఉత్తాల వియత్తులు, మరి ఈ వచన గంధి కవితా సంపుటి తిరుగుతున్న మలుపులు - అవిగో చెబుతాయి ఆ కొస తీగ మెలుపులు.

పీఠిక గ్రంథ సమీక్ష కాగూడదన్న విశ్వాసం నాది. అది గ్రంథ వాటికలోకి ప్రవేశపెట్టే వివృత కవాటికగా ఉండాలి. 'అభినవ పోతన' పద్యం, గేయం, నాటకం, బుర్రకథ వంటి ప్రక్రియలను చవిచూపిన సహృదయ పాఠకులకు ఈ మలుపులోనూ సౌందర్యాత్మక సందేశం లభిస్తుందని ఆశిస్తున్నాను.

—o—

# నాలో మాట

విద్యా ప్రవీణ, భాషా ప్రవీణ,
S. T. P. V. కూర్మాచార్యులు M. A.
అధికార భాషా సంఘ సభ్యులు.

పోతన చరిత్రలో "పోతన" గానే మనకు
సాక్షాత్కరిస్తున్న శ్రీమాన్ ఆచార్యులవారు
ప్రాచీన కవిత్వంలో ఎంత రస ప్రగతిని
సాధించేరో "కూలిపోయే కొమ్మలో"
శ్రమ జీవుల జీవితాన్ని శ్రమజీవిగానే
అవతరించి టెలివిజన్‌వలె దరిద్ర నారాయణుల
జీవితాన్ని తమ ఆధునిక కవితలో
అందంగా చిత్రించేరు. అందరికీ అందని
ఆకాశంలో విహారించేది; ఆచార్యులవారి కవిత్వం;
అనుకొనే వారికి అందరికి అవలీలగా అందే
"అతి రసం గల" ఆధునిక కవిత్వాన్ని కూడ
అందచేసి, అతిసామాన్యుని కూడ, ఆనందింప చేసేరు
శ్రీమాన్ వానమామలై వరదాచార్యులవారి
కవిత్వాన్ని అభినందించే అర్హతలేని నాబోటి
వారికి కూడ ఆనందించే హక్కున్నదని
నాలో మాటను మీలో కందిస్తున్నాను.

# పరిచయం

వి. పి. రాఘవాచార్యులు, M. L. C.

"కూలిపోయే కొమ్మ" అనే-ఆధునిక సాహిత్యంలో నిలువ దొక్కుకునే తమ కావ్యానికి పరిచయం వ్రాయుమని, ఆత్మీయులు, నాకు గౌరవ పాత్రులు, అయిన శ్రీమాన్ వానమామలై వరదాచార్యులు గారు నన్ను కోరారు. నేనీ పనికి అసమర్థుడనని నాకు తెలుసు. ఆ మాట వారికి చెప్పాను. వారు వినలేదు. కనుక నాకు వ్రాయక తప్పలేదు.

ఆచార్యుల వారు సంప్రదాయ సిద్ధమైన కావ్య రచనలో నిష్ణాతు లని తెలుగు సాహితీ ప్రపంచానికి బాగాతెలుసు. వారి పోతన కావ్యము వారిని అభినవ పోతనను చేసింది. మహా కావ్యము, ఖండ కావ్యము గేయ కావ్యము, సంప్రదాయ సిద్ధమైన నాటకము, నాటిక, హరికథ. బుర్రకథ, నవల ఇలా బహుముఖమైన సాహిత్య సృష్టిచేశారు ఆచార్యుల వారు. ఇప్పుడు సంప్రదాయాన్ని తెంచుకొని, ఛందో బంధములను విచ్ఛిన్నంచేసి, మాటలలో మధురమైన కవితా గానం చేశారు. సమత. మమత, మానవత, ఈ కావ్యములో వారు ఆద్యంతములు ఒయ్యారంగా ఒలక బోసిన భావావేశాలు. ఆచార్యులవారు కలము పడితే కావ్య సృష్టి నోరు విప్పితే మధుర గాన వృష్టియే. "కూలిపోయే కొమ్మ" లో ఈ సృష్టి, ఈ వృష్టి- విరివిగా ప్రసరించాయి.

"నాకవిత కాగితముపై నున్న ఎత్తు వంపులు లేని చదును," "నానినాదము "నరజాతి అంతా ఒక భూమాత గర్భశుక్తి ముత్యాలు." ఈ సామ్యవాదాలు త్రికాల నగ్న సత్యాలు. ఈ సమతా పథాల్లో నడిచి గమ్యము చేరకుండా మందరము; అనే నినాదంలో సత్యం, శివం, సుందరం, ఆయన దర్శించారు. 'కూలిపోయేకొమ్మ' అనే శీర్షికతో

వ్రాసిన కవితా ఖండమే ఈ కవితా సంకలనానికి శీర్షిక అయింది. "అణువులో నుండి వచ్చిన బ్రహ్మాండములా అవతరించిన" వృక్షం నాలుగు కొమ్మలను హిందూ సమాజములోని నాలుగు వర్ణాలుగా ఊహించి, కూలి పోయిన నాలుగవ కొమ్మ దీనత్వాన్ని గుండె కరుగు నట్లు, చిత్రించారు ఆచార్యులవారు. "అసంస్కారవరుడు, స్వీయ సుఖానికే ఈ కొమ్మలన్నీ సృష్టింపబడిన వన్నట్లు, విచ్చల విడి విహారాలు, విరుపులు, కొట్లు,తానాడినది ఆటగా, పాడినదిపాటగా, వీర విహారము చేసే ఒక వానరుని స్వైర విహారానికి తట్టుకోలేక పశువులకు ఎరయై శిశువుల ఆటలకు గురియై, ఈ నాలుగవ కొమ్మ కాలానికి ఎదురీదలేక నేలకొరిగింది. అందరికీ అందే ఈ కొమ్మను జుట్టుపట్టివంచారు. పచ్చదనాన్నే త్రుంచారు. తన మాతృ వృక్షానికి అంటీ అంటకుండా, ఉండీ లేకుండా వున్నది." ఈకొమ్మ. వానరత్వాన్ని వంచించే నరుడు పుడతాడు. నీ ఔన్నత్యానికి నడుము కడతాడు. అవనితల్లి "కొమ్మలన్నీ నాకు సమానమే అని కూలిపోయే కొమ్మను ఓదార్చింది. చెంతకు తార్చింది. కూలిపోయే కొమ్మల వూడలలో వుర్వి పొట్ట జొచ్చి, కొత్త ఇగురెత్తింది". ఇది ఆచార్యుల వారి సమతా శంఖారావం, భావి సమాజస్వరూపానికి జోస్యం."నిశాచరులు, పిశాచాలు అయి రాత్రింబవళ్లు తనను పీడించే వారి బారి నుండి తప్పించుకోవాలని రాత్రింబవళ్లు ఆరాటపడే ఒక మామూలు మనిషి"; "తన గుడ్డల ఇస్త్రీ మడుపులు చెడక వుండాలని అవి చెప్పినట్లు వింటున్న, తక్కిన వారిని కుక్కలకంటె చుల్కనగా "చూస్తున్న" ఒక పెద్దమనిషి" ఉదంతం; "స్వార్థ దేవతా ఉపాస్యం" చేసే వంచకుని కథ; "అసురులు కాని మానవులు పల్కిన అపశ్రుతులు;" "కష్టజీవుల కలత మనసులు కలిసిమెలిసి, ఎదురునిలిచి మబ్బులై, మాయలై, ఉరుములై, మెరుపులై విరుచుకపడి గాలివానలై, గర్జించి, వర్షించి, వాహినులై, చక్రాధిపతులను, ధనవంతులను, ముంచెత్తే" గాలివాన; "నవతకై యువత"కు ఆహ్వానం; "మంచితనం లేని మానవునికన్నా తిర్యక్కులే సయమని" అభిశంసన "యీ సృష్టి సమష్టిది" "సమతా దీపం," "నళ వచ్చింది" యీ కావ్య సంకలనంలోని రత్నాలు, మాణిక్యాలు.

ఇంతకన్నా ఆచార్యుల వారి కావ్య మీమాంస నేను చేయ
ఆ పని సహృదయులైన రసికులే చేస్తారు. ఈ కావ్యంలో ఆచార్యుల
ప్రజా వాణిని ప్రస్ఫుటంగా వినిపించారు. రానున్న విప్లవాన్ని గు
సమాజానికి హెచ్చరిక చేశారు. ఆచార్యా, నమోస్తు. మీ యీ కా
మోడు వారిన పీడిత జనుల హృదయాలను చిగురిస్తుందని నా నమ్మ
తెలుగు ప్రజలు ఈకావ్యాన్ని కౌగలించు కుంటారని నాకుతూహలం.



# అభినంతి

పి. రామబ్రహ్మం M L.C.

మహాకవి, అభినవ పోతన బిరుదాంచితులైన శ్రీ వానమామలై వరదాచార్యులు ఆంధ్రపాఠకలోకానికి చిరపరిచితులు. వీరు వివిధసాహిత్య ప్రక్రియాంబుధులను మథించి అందరికీ అమృతాన్ని పంచారు. మానవాభ్యుదయంకోసం అంకితమైన వీరి కలపు మరోసృష్టి ఈ చిన్ని పొత్తం. దీన్ని చదువుచున్నంతసేపు మానవత్వం గల మహామనీషిగా మనముందు కదులాడుతా డీ మహాకవి.

కొందరు ఉబుసు పోకకు పుస్తకాలు వ్రాస్తారు. పేరుకోసం వ్రాసేవారు మరికొందరు. నిత్య జీవితంలో, సమాజంలో ఎదురవుతున్న దురాచారాలను సహించలేక సంస్కరణోద్యమానికి నడుంగట్టి కలం పట్టిన వారిని ఏకొద్దిమందినో చూస్తాం; అట్టివారిలో 'వానమామలై' ఒకడుగు ముందే వేశారంటే అతిశయోక్తి కాదు.

తనకు తానుగా సంఘంలో దారిచేసుకుంటూపోతూ తక్కినవారికి మార్గం చూపించే తత్వం వీరి రచనలో మనకు కన్పిస్తుంది. "నా పరిచయం" లో వీరు నవతతో భూత దానవతను రూపుమాపికవితలో మానవతకు ప్రాణం పోస్తానంటారు. "సత్యం-శివం-సుందరం" వ్యక్తుల విలువల్ని ధ్వనింపజేసేదిగా అవగత మౌతుంది.

"మీరు క్షరాలతో అక్షరాలను తూకం చేయకండి. మీరు నక్షత్రాలను నవరత్నాలతో కొనివేయకండి" అంటాడీకవి. ఫలపుష్పాలిచ్చి పదిమందికీ నీడనిచ్చి ఎన్నోజీవులకు ఆశ్రయం ఇచ్చే వృక్షాన్ని నరికి కృతఘ్నులు కావద్దన్న సందేశం బహుఉదాత్తమైనది.

ఈ కావ్యం బహు సందేశాత్మక మైనట్టిది. ఈనాటి కాలానికి అనువైన ఇటువంటి రచనలు రావటం మన అదృష్టమనే చెప్పాలి. పదును కలిగిన వీరి కలం పదిమంది హృదయాల్లోను స్పందించి, సత్యలోకాన్ని చూపించి, సర్వమానవ సమానత్వాన్ని అలవరుస్తుందని ఆశిద్దాము.

# ఆజ్ఞ అనుల్లంఘనీయం కనుక....

—కుందు

శ్రీమాన్ వానమామలై వరదాచార్యులవారు నాకు చిరకాలం ఇష్టమిత్రులు. వారు నాకంటే వయస్సులోనూ, పాండిత్యంలోనూ కవి శక్తి ప్రదర్శనలోను పెద్దలు అయినా వారికి నాయందు అపరిమితమైన అభిమానం. అందువల్లనే తమ యీగ్రంథానికి నన్ను పీఠిక వ్రాయవ వారు దయతో ఆజ్ఞాపించినారు. నిజానికి వారి గ్రంథానికి పీఠిక వ్రా వలసిన తాహతు నాకు లేదు. కాని వారి కోరికను మన్నించకపోవ ఎలా?

వచన కవితాప్రక్రియలో నన్ను ఒక పెద్దగాచేసి పలుకరించట మాట్లాడం వారికి అలవాటు. ఈ విషయంలో వారికి నాయందు అభిమానం ఎంత ఎక్కువగా వుందో చూపడానికి ఒక చిన్న సంఘ మనవిచేస్తాను. సుమారు నాలుగైదు ఏళ్ల క్రితం ఆకాశవాణి వారు గాం జయంతి రోజున ప్రేక్షకుల సమక్షంలో ఒక కవి సమ్మేళనం ఏర్పా చేశారు. వరదాచార్యులవారు దానికి అధ్యక్షులు. అధ్యక్షోపన్యాస అయిన తరువాత వరుసగా ఆయా కవుల పేర్లను పిలవడం అధ్యక్షు పని. సుమారు ఇరవైమంది కవులలో నేను వరుసక్రమంలో మధ్య వున్నాను. నాకంటే ముందువారిని పిలిచినప్పుడు, నా తరువాత వా పిలిచినప్పుడు మామూలుగా వారివారి పేర్లతో పిలిచీ, నావద్దకువచ్చినప్పు "వచన కవితా స్ఫూర్తి శ్రీ కుందుర్తి" అని పిలిచారు. ఆయనకు నాప గల అభిమానం ఆ విధంగా, ఇతరులు ఏమి అనుకుంటారో అని సందేహ కూడా లేకుండా, కట్టలు తెచ్చుకొని బయటికి పొంగింది! ఇది గమనిం ప్రక్కనున్న ఒకరిద్దరు కవులు కోపగించుకున్నారు కూడా, అది వే సంగతి.

ప్రాచీన ఛందోమార్గంలో బాగా చేయితిరిగిన అనేకమంది పండిత కవులు కూడా ఈనాడు వచన కవితపట్ల మొగ్గుచూపుతున్నారు. ఆదరాభిమానాలు ప్రకటిస్తున్నారు. ఎవరో ఒకరిద్దరు మినహాయిస్తే, మిగిలినవారందరూ చూపుతున్న యీ ఆదరణ నిజాయితీతో కూడినదేనని నేను అనుకొంటాను. ఎందుకంటే, మొదటినుంచీ కూడా ప్రాచీన అలంకారికుల మతం ప్రకారం కావ్యవస్తువు ఏమిటనే విషయానికికాక కావ్యరచనా పద్ధతి, రసవంతంగా కావ్యనిర్వహణ శక్తి మొదలగు వాటికే ఎక్కువ ప్రాధాన్యం ఉంటూ వుండేది. ఈ ప్రాచీన కవితాభిమానులైన పండిత కవులందరూ ఆయా అలంకార శాస్త్ర సూత్రాలకు అనుగుణంగా ఆలోచించేవారే కాబట్టి, ఏనాడో ఆరంభంలో కావ్యవస్తువును గురించి కొంత అసంతృప్తి తమ మనసులో వున్నప్పటికీ, కాలక్రమేణా దానిని తొలగించుకొని రసవంతమైన కావ్యనిర్వహణ వచన కవితాప్రక్రియలోకూడా సాధ్యం ఔతుందనే విశ్వాసానికి దగ్గరగా వచ్చారు. అటువంటివారిలో నూటికి నూరుపాళ్లు నిజాయితీతో వచన కవితాప్రక్రియను అభిమానించారు, అవలంబించిన వారు శ్రీమాన్ వానమామలై వరదాచార్యులవారు. ఆచార్యులవారు కొత్తగా సమ్మేళనాలలో వచన కవిత చదువుతూ వుంటే ప్రక్కనున్నవారు అదోరీతిగా హేళనగా చూస్తూవుండేవారు. నేను మాత్రం దీనిని హృదయ పూర్వకంగా ఆహ్వానిస్తూ మనసుకో సంతోషిస్తూ వుండేవాణ్ణి. వచన కవితా ప్రక్రియను అవలబించినపూర్వ కవితాభిమానులలో అందరికి యీ కొత్త పద్ధతిలో చేయి తిరిగిందని చెప్పడానికి వీలులేదు. అసలు వచన కవిత రాణించాలంటే కవి తనకున్న పాండిత్య ప్రకర్షను సాధ్యమైనంత ఎక్కువగా తగ్గించు కోవడం అవసరం. కవిత సారళ్యంవైపు మొగ్గడం అవసరం. బాగా పాండిత్యం వున్నవారికి ఒక్కొక్కప్పుడు ఇది అసాధ్యమైనా కావచ్చు. వరదాచార్యులవారు యీ ప్రక్రియచేపట్టి నిర్వహించేటప్పుడు తమ పాండిత్యం విషయంలో బాగా నిగ్రహాన్ని ప్రదర్శించి ఇందులోని వివిధ ఖండికలు వ్రాసినట్లుగా కనిపిస్తున్నది. నిజానికి నాదృష్టిలో యీ కావ్యంలో వున్న శైలి ఇంకా సాధ్యమైనంత ఎక్కువగా సరళత్వం పొందాలని, అయినా కవిగారికి వుండే పాండిత్య ప్రమాణం దృష్ట్యా ఇప్పటికే చాలావరకు ఆయన ఆ విష

యంశో విజయం సాధించినారనే నేను అనుకొంటున్నాను. ఇంకా ఇంకా వ్రాసిన కొలదీ ఆచార్యులవారి శైలి సామాన్య పాఠకులఅవగాహన పరిధి లోనికి అంతకంతకు ఎక్కువగా వస్తుందనే సమ్మకం నాకు వున్నది.

ఆచార్యులవారి భావనలో అడుగడుగునా సమతాదృష్టి, అభ్యుదయ భావన పెనవేసుకొని కనిపిస్తాయి. 'నేను మానవుణ్ణి' అనే ఖండికలో సర్వమానవ సౌభ్రాత్ర భావన బాగా చోటు చేసుకొన్నది. 'ఎవరు మీరు' అనే ఖండిక ప్రగతి నిరోధకులైన వారికి దెబ్బకొడుతున్నదని. 'మానవతా వృక్షం' అనే ఖండిక కూడా చాలాచక్కగా పోషించబడింది. పోతన్నవంటి పూర్వ కథలను తీసుకొన్నప్పుడు, ఎక్కడో ఒకచోట మరీ సందర్భం వస్తేతప్ప, యీవిధంగా మానవతా దృష్టి అభ్యుదయ భావన, సమతా సమాజ ఆదర్శం మొదలైన ఆధునిక భావనలను వివరించటానికి వీలు వుండదు. ఇటువంటి ఆధునిక భావనలను వచనకవిత్వం ఒకటే బాగా ప్రతిబింబించకలదు. కావ్యవస్తువు సమకాలికమైన పరిస్థితులను, సంఘ టనలను నచ్చేటటువంటి అభిప్రాయాలను ప్రకటించాలన్నా వచన కవిత్వం అనే ప్రక్రియ ఒకటే దానిని సాధించగలిగింది. పూర్వ కవితా పద్ధతిలో ఆరితేరిన వారు కూడా యీ ప్రక్రియను చేపట్టడంతోటే ఇటు వంటి ఆధునిక భావాలవైపు మొగ్గుతూ ఉండటం మనం చూస్తున్నాం. శ్రీమాన్ వరదాచార్యుల వారు వచనకవితాప్రక్రియను చేపట్టిన తరువాత యిటువైపు బాగా మొగ్గు చూపిస్తున్న విషయం స్పష్టంగా కనిపిస్తు న్నది.

ఆచార్యులవారు తెనుగులో చేపట్టి నిర్వహించని ప్రక్రియ లేదు. బుర్రకథ దగ్గరనుంచీ పోతన మహాకావ్యం వరకు వారు వివిధ ప్రక్రియ లను సమర్థవంతగా నిర్వహించారు. మాయిద్దరి మధ్య ఇటీవల యీ విషయ ప్రసక్తి వచ్చినప్పుడు మీరు 'ఉదాహరణ' కావ్యాన్ని వ్రాశారా అని అడిగాను. అదికూడా ప్రయత్నించి వ్రాస్తానని వారు మాట యిచ్చారు. వారికి తగినంత పాండిత్యంవుంది. భాషమీద అధికారం వున్నది. అభ్యుదయ భావన వున్నది. రసవంతంగా కథను నిర్వహించే శక్తిసామర్థ్యాలు వున్నవి. వారిని గురించి యీ మాటలన్నీ చెప్పటం

నిజానికి చర్విత చర్వణమే అయినప్పటికీ నాకు వారు పెట్టిన బాధ్యతను బట్టి విషయం మళ్లీ చెప్పవలసి వస్తున్నది. ఆచార్యుల వారు ఇంకా వచన కవితా ప్రక్రియను అధికాధికంగా నిర్వహించాలని నేను కోరు కుంటున్నాను పోతన వంటి మహాకావ్య నిర్మాణం యీ రోజుల్లో మాట లతో అయ్యేపని కాదు. వారు దానిని సర్వాంధ్ర ప్రజలకు. పండితులకు ఆమోదకరంగా నిర్విహించారు అదే విధంగా వచన కవితా ప్రక్రియలో కూడా వారు ఒక మహాకావ్యాన్ని నిర్విహించగల సమర్థులు. ఆ మంచి రోజుకోసం నేను ఎదురు చూస్తూవుంటాను.



# విజ్ఞప్తి

## వానమామలై వరదాచార్యులు

"ప్రపంచంలో దుష్టులైన బలవంతులు శిష్టులైన బలహీనుల వేధించి వేపుకొని తినడం" అనే అధర్మాన్ని జూచి సహించలేక "రసోవై సః" అనే నిర్వచనానికి లక్ష్యభూతుడైన పరమాత్మ గూడా రామకృష్ణాద్యవతారము లెత్తడం మనం వింటూఉన్నాం. ఆ దురాత్ముల దునుమాడి ప్రజానీకాన్ని పరిరక్షించడం వల్లనే ఆ యవతారాలకంత ఆదరం లభించింది. అలాగే రస స్వరూపమైన కావ్యం గూడా 'దౌర్జన్య పరుల సహించలేక కరుణామేఘ రూపంలో పిడుగులను రాలుస్తు గర్జిస్తూ దుఃఖ వర్షం గురిపిస్తూ అనేక కృతిరూపాలను ధరిస్తుంది.

ఈశ్వరుడైనా కవీశ్వరుడైనా ఆకృతులతోనో కృతులతోనో అవతరించి అన్యాయాన్ని ఖండించవలె. అనదల బాధలను గాంచి కరగి పోవలె వేదన పడవలె. అందుకే ఆదికవి వాల్మీకి శోకం శ్లోకత్వం జెందింది రామాయణాదిలో. అతని వేదనాభర శాపం అనుకోకుండా మాత్రాలయ బద్ధమవడం తప్ప కావాలని ఆయన తన వేదన రాగంతో లయతో పాడుకొనలేదు. అదే నిజమైన కవితా గంగాఝరి. ఇది నిర్దిష్ట మార్గం లేకున్నా స్వేచ్ఛా మార్గంగానే తన గమ్యం చేరుకుంటుంది.

గద్యమా ? పద్యమా ? అనే విమర్శ కావ్యంవట్ల అనవసరం. గద్యం కావచ్చు పద్యం కావచ్చు; పద్య రూపంలో ఉండే గద్యం కావచ్చు. గద్య రూపంలోని పద్యం కావచ్చు. ఏ దైతేనేం? అన్యాయుం జూచి సహించలేక హృదయం కదలీ కరగీ ఆవేశంతో ఆక్రందించే ఆవేదనా నినాదమే కవిత 'అది రెండంచుల కత్తి. ఒకవైపు అన్యాయ

వృక్షాన్ని పడగూల్చే వీరరసం ఇంకొకవైపు దుర్బలుల దైన్యస్థితి కండ్లకు గట్టినట్లు వర్ణిస్తూ మానవతా హృదయాన్ని కోసే కరుణ రసం. ఇందులో ఈ కరుణ రసం వీరానికి దారితీస్తుంది అందుకే "కవిం పురాణ మను శాసితారం" అనే శ్రుతి వాక్కు కవిని అనాదిగా ప్రపంచాన్ని శాసించి ధర్మాన్ని పాదుకొల్పే వానిగా చిత్రీకరించింది. కవి ఎన్నుకొనని శాసన కర్త. పండితులంతా భాషా దోషాలకంటే ప్రపంచంలో పశుత్వంతో రాక్షసత్వంతో స్వార్థంతో చేసే అజ్ఞానుల భావగత దోషాలనే సంస్కరించ బూనుకుంటే పాండిత్యం మిక్కిలి ప్రయోజనకారియౌతుందేమో? దోషజ్ఞ నామం అన్వర్థపడుతుంది. భాషయైనా శాస్త్రమైనా మానవత్వంలోని పశుత్వాన్నీ రాక్షసత్వాన్నీ నశింపజేసి సమాజాన్ని సంస్కరించడానికే ఏర్పడినాయని ఎంత గ్రహిస్తే అంత నిజాన్ని గ్రహించినట్లౌతుంది. నీరు దాహాన్ని ఆర్పడంతోపాటు శరీర మాలిన్యాన్నీ కడిగి శుభ్రపరచాలె. అలాగే కావ్యరసం గూడా ఆత్మానందమునిస్తూనే సంఘాన్ని సంస్కరించ డానికవసర పడాల్సిందే.

కవియైనా పండితుడైనా "నీకంటే నే నెక్కువ చదివాను నీ కన్న నే నే గొప్పవాణ్ణి" అని గర్వించి తృప్తిపడడానికి కాదని తెలిసికోవాలె. తానుబాగుపడి సంఘాన్ని బాగుపరచడానికని భావిస్తేనే అది ప్రయోజన కారియౌతుంది. అవసరమైన అన్నంతోపాటు, అతి రుచికరమైన శాకపాకాలవలె అన్యాయాన్ని ఖండించడానికవసరమైన కవితకు కూడా ఆహ్లాదాన్ని కలిగించే ధ్వన్యలంకార విశేషాలు తామవసరం కాకపోవు. తినే అన్నాన్ని అత్యంత ప్రేమతో, తినిపించే రుచిని పొందించే కూరగాయలు కూడా భోజనంలో ఒక భాగంగా రూపొందాయి. అందుకే శబ్దార్థ సౌందర్యముల వృద్ధి చేసి అభిరుచిని పెంచే వ్యంజనాదికములైన అలంకారాదుల తగినంతవాడు కొన్నట్లైతే కావ్యపు విలువను పెంచినట్లే ఔతుంది. మాలిన్య రహితమైన పుష్టివంతమైన పదార్థ భక్షణం వలెనే కవి పరిశుద్ధంగా ఉండే సజీవంగా ఉండే పద అర్థాలను ఉపయోగించు కొన నేర్చుకోవడం ఎంతైనా ప్రయోజనకారి. కవితా కన్యకు ప్రతిభా రూప సౌందర్యంతోపాటు భాషావ్యుత్పత్తినామకమైన కండపుష్టి తగినంత యవసరం గాక తప్పదు.

కవికి ప్రతిభా నేత్రం దివ్య చక్షుస్సుగా తెరుచుకొని అప్రత్య విషయమును గూడా ప్రత్యక్ష విషయంలా స్ఫురింపజేస్తుంది. అలాం కవియే ముక్కంటివలె తన భావనా సమాధిలో నుండి అనర్గళధార వాహినులగు రసగంగలను తలధరించగల్గి యుంటాడు. ఆ కావ్యర గంగలో మునిగి ప్రజానీకం మాలిన్యా లంతరంచి అంతర్బహి రంగము పవిత్రులౌతారు.

అసమానత్వం నుండే దౌర్జన్యం ఉదయిస్తుంది. బలవంతుడ బలహీనుణ్ణి బీదవాణ్ణి అణచిపట్టి వెట్టి గొట్టి దొరగా చెలామణియై మురిః పోతుంటాడు. ధనికునికి సకల భోగభాగ్యాలు అందుబాటులో ఉంటవి బీదవానికి అవి గగన కుసుమాలు. అందుకే మొదలు ఆర్థిక సమానత్వం తెస్తే అది సులభంగా సాంఘిక సమానత్వాన్ని తెస్తుంది. అప్పుడ కాని ఒకడు మరొకణ్ణి పీడించే దౌర్జన్యం నశించదు. ఇలా పీడల నశింప జేసి శాంతి సౌఖ్యాల నెలకొల్పే రాజకీయ శక్తినే ప్రజ ఆరాధిస్తుంది అన్న వస్త్రాలకు లోటులేని పౌరుడు అన్ని విద్యావిజ్ఞానాల సాధింప గల్గుతాడు. ఆరోగ్య భాగ్యాల తులదూగుతాడు. పశుత్వం వీడి నాగరికుడౌతాడు. సంఘ విశ్వరూపంలో తానొక అంగమై జాతీయతను ఆరాధిస్తాడు. అపుడుత్తమ పౌరుడై హక్కులతోపాటు దేశ సౌభాగ్యం పెంపొందించే పట్ల తన బాధ్యతల గూడా గుర్తిస్తాడు. అపుడు దేశ సంపద కొందరికే కాకుండా అందరికీ పంచిపెట్టబడి పౌరులను భోగలాలసులను గాకుండా కర్తవ్యోన్ముఖులను గూడా చేస్తుంది. ఈ సమాజంలోని పౌర వర్గం అందరూ స్వతంత్రులైన రాజులే కాక అందరు శ్రామికులైన సేవకులు గూడా ఐయుంటారు. అప్పుడు సోదర భావం పొదుకొన్న నవసమాజం ఏర్పడుతుంది. ఇలాంటి సమాజావస్థ శాంతి సౌఖ్యాల సమంగా పంచే ప్రజా సంక్షేమ రాజ్యం. దానిలో ప్రజా ప్రతినిధులగు పాలకులకు ప్రజలు తమ అండదండల నిచ్చి ప్రజా స్వామ్య వ్యవస్థగా రూపొందిస్తారు. అది ఆరోగ్యకరమైన రాజ్య వ్యవస్థ. దానిలో గూడా ప్రజాస్వామ్య విరోధిశక్తులు స్వార్థపూరితాలై తలెత్తడానికి ప్రయత్నిస్తాయి. వానిని అహింసా మార్గంతోనైనా, దానికి సాధ్యం కాకుంటే హింసా మార్గంతోనైనా చక్కపరచే

మార్గాలున్నాయి. వ్రణాన్ని ఔషధాలతో బాగుపరచవచ్చు వానికి లొంగకుంటే శస్త్రచికిత్స తప్పనిసరౌతుంది. వీలైనంతవరకు శస్త్రచికిత్స అవసరంలేని మార్గాలనే అనుసరించడం చాల అవసరం. అదే బాధ రూపంలో ఉండని బోధరూపం. అదే కవితతో చేసే కాంతా సమ్మితోప దేశం. అది బయం జూపి కాక నయంతో హృదయాలను మారుస్తుంది. అది చల్లగా సాగిపోతున్న గంగాఝరి యని అన్నాము. ఆ గంగ చల్లనిదే కాని అడ్డు వచ్చిన గట్లను, చెట్లను, కోయగలదు; సమూలం పెకల్చివేయగలదు గూడా. కవితా శక్తి కన్ను విప్పజేసి మార్గం చూపే సవితృశక్తి లాంటిది.

వచన కవితలో గణాలకు యతిప్రాసలకు పడేపాటూ శ్రమా కవితా విషయక ఆలోచనకే వినియోగపడుతుంది వచన కవితలో పాఠకునకు పద్యాన్నివలె అన్వయం చేసుకొనే శ్రమ తగ్గుతుంది. ఇలా ఉండడంవల్ల వ్రాసే కవికి చదివేవారికి శ్రమ తక్కువే. కవితా భోజనాన్ని అటు పద్యాల పళ్ళెరంలో బెట్టినా తామరాకు విస్తట్లో వడ్డించినా తినే వారికి అభ్యంతరములెట్లు ? కావలసింది భోజనం గదా ! వచన కవితకు ప్రజా కల్యాణం ప్రధాన లక్ష్యం. ఈ కవితకు రాజకీయ సాంఘిక సమస్యలు రెండూ రెండు కన్నులే. ఇవి పేరుకే వేరుగాని యీ రెంటి దృష్టి ఒకే ఒకటి, ఒకే పథాన్ని చూపుతాయి. అందుకే నన్నయ నుండి నా వరకు విశ్వశ్రేయమే కావ్యధ్యేయము. అదే రాజకీయ న్యాయము గూడా. ఇవన్నీ వచన కవితా దృష్టికి జాతీయతా భావాల వైపు మరల్చినది ప్రోత్సహించినది శ్రీ కోదాటి రాజమల్లుగారు.

నేను నా యీ కావ్యాన్ని గౌరవ మిత్రులు శ్రీ రాజమల్లుగారికే అంకితంగా ఇస్తున్నానంటే వారివల్ల ఏదో ఆసించికాదు; ఆయనలో ఉన్న మానవత్వానికి మెచ్చి. దీనికి ముద్రణరూప మిచ్చి దీనిని అంకితంగా తీసికోవడానికి సమ్మతించిన- (ఆం. ప్ర.) ఆరోగ్యశాఖా మాత్యులు- శ్రీ కోదాటి రాజమల్లుగారికి నా హార్దిక కృతజ్ఞతలు. అలాగే దీని ముద్రణలో శ్రద్ధతీసికొని నిర్దుష్టంగా బయటకుదెచ్చిన ఆత్మీయులు, ఆప్తమిత్రులు శ్రీ బి. అచ్యుతరాజుగారికి నా ఆశీస్సులు; తోడ్తో నా

కృతజ్ఞతలు. ఈ గ్రంథమును ముచ్చటగా ముద్రించిన దక్షిణ భారత ప్రెస్ పెద్దలకును ముఖపత్రమును ముద్దుగా దిద్దితీర్చిన శ్రీ కొండపల్లి శేషగిరిరావుగారి కిన్ని దానిని అందముగా అచ్చువేసిన ఉదయ ఎంటర్ ప్రైజెస్ అధిపతులకున్నూ నా కృతజ్ఞతలు "ఇతిశమ్".



# అనుక్రమణిక


| | | |
|---|---|---|
| | అంకితం | iii |
| | మరో మలుపు | v |
| | నాలోమాట | vii |
| | పరిచయం | viii |
| | అభినుతి | xi |
| | ఆజ్ఞ అనుల్లంఘనీయం | xii |
| | విజ్ఞప్తి | xvi |
| 1. | నా పరిచయం | 1 |
| 2 | సత్యం శివం సుందరం | 5 |
| 3. | కూలిపోయే కొమ్మ కొత్త చిగురెట్టింది | 9 |
| 4. | మానవతా వృక్షం | 13 |
| 5. | ఎవరు మీరు ? | 16 |
| 6. | శాంతి కపోతి | 18 |
| 7. | చీకటి రాకాసిని ఉరివేయండి | 20 |
| 8. | నేను మానవుణ్ణి | 23 |
| 9. | సమతా దీపం | 25 |
| 10. | బలిని పాతాళం తొక్కాలె | 27 |
| 11. | సహస్రదళ మహాపద్మం | 29 |
| 12. | సార్వభౌమ వృక్షం | 31 |
| 13. | నళ వచ్చింది | 33 |
| 14. | సమష్టి దీ సృష్టి | 37 |

| | | |
|---|---|---|
| 15. | ఆకలిదే ఆకలి | 40 |
| 16. | ప్రకృతి ప్రేమ మూర్తి | 44 |
| 17. | తిర్యక్కులేనయం | 46 |
| 18. | మా యింటి పరిచయం | 49 |
| 19. | వెనక్కు పోకండి | 55 |
| 20. | సంఘం శరణం గచ్ఛామి | 57 |
| 21. | చచ్చి పగ సాధించింది | 59 |
| 22. | నవత రావాలె | 61 |
| 23. | గాలి వాన | 63 |
| 24. | స్వార్థంబలిసి  సమాధి కట్టింది | 66 |
| 25. | అప్రశుతుల సవరణ | 68 |
| 26. | అర్థం లేనిది వ్యర్థం | 71 |
| 27. | స్వార్థం అధికారి యైనది | 73 |
| 28. | స్వార్థం అధికారి కావాలంటే | 75 |
| 29. | వారు నిశాచరులు, పిశాచాలు | 77 |
| 30. | ఎవరీతడు ? | 81 |
| 31. | ఆశీస్సులు-అక్షరాక్షతలు | 84 |
| 32. | ఏం మారింది మనిషి స్వభావం ? | 85 |
| 33. | నవోదయం నవ్వింది | 90 |
| 34. | ఎందుకింత కోపం ? | 94 |



# నా పరిచయం

నేను కవిని — కవిత్వం వ్రాస్తాను.
నేను భువిని - అన్నిటినీ నా లోపలే సృష్టిస్తాను.
నేను రవిని— ఆర్పరాని అగ్నినై చూస్తాను.
నేను రవిచ్ఛవిని - లోకపు కన్ను దమ్ముల వికసింప జేస్తాను.
నా తమ్ముల కన్నుల వికసింప జేస్తాను.
నేను సురగవిని - సుధా రసాల వర్షిస్తాను.
నేను దివిని - నా ప్రపంచాన్నే అక్షరం, అమరం చేస్తాను.

నేను పవిని - ఉరుముతాను జగాలు విన.
మెరుస్తాను - జనాలు తమ మార్గాలు కన.
నేను హంసను - పరమహంసను.
దౌర్జన్యంపై దాడి వెడలిన అహింసను,
నేను మానస సరోవరంలో విహరిస్తాను.
అన్ని రసాల్లో మునిగి అంటకుండా ఈవలికి వస్తాను.
పాలు నీరు వేరుచేసి చూపిస్తాను.
వాణీ వాణీశుల తల దాల్చి దర్శన మిస్తాను.
నేను హంసను - పరమ హంసను.
నేను దౌర్జన్యాలపై దాడి వెడలిన అహింసను.
నేను చల్లని తెల్లని రూపంలో ఉన్న మీ శాంతిని
నేను మానవునిలో మాధవుని దర్శించే వేదాంతిని.
నేను భూమిపై నడచిన, ఒయ్యారాలొలక బోసే
మీ ఛందమువలె అంద మిస్తాను.
నేను సంగీత గంగారస తరంగిణిలో క్రీడించినపుడు
గేయాల తరగలపై ఊయాల లూస్తాను.
నేను కాలాకాశంలో ఉడ్డీనం చేసినపుడు
అవధులు దాటి అనంత పథాల్లో విహరిస్తాను.
వచన కవితలా కనిపిస్తాను.
నేను త్రిపథ గామినీ, విశ్వప్రేమిని;
నేను హంసను - పరమ హంసను.
నేను దౌర్జన్యంపై దాడి వెడలిన అహింసను.
నేను శ్రుతిప్రియ సుందర రీతుల్లో పలుకుతాను.
నేను పద పదాన అనురాగం చిలుకుతాను, కాని
రోగ బాధలను రాగాల్లో బంధాలను ఛందాల కందాల్లో
పాడి వినిపిస్తే పసందుగా నుండదేమో ? !

నాకు చాదస్తాలు గిట్టవు, అవి ప్రగతిపేరు పెట్టుకున్నా పట్టవు.
నేను పద్యం రూపంలో ఉన్న మీ అద్దాన్ని.
నాలోచూచి మిమ్ము మీరు దిద్దుకొనే పారిశుద్ధ్యాన్ని
నా వైపు చూస్తే మీరు నేనై హసిస్తాను, విలపిస్తాను.
మీరే నేనై నేనే మీరై వ్యవహరిస్తాను.
మంచికి పోసిన ప్రాణం నాకు సన్మానం.
నరుడు తాను చావ త్రాగే విషపానం నాకు అవమానం.
నేను శుద్ధుడను - నేను బుద్ధుడను.
ప్రకృతి రామణీయక బద్ధుడను.
కట్టుబాట్ల తూకాల కంటే గిట్టు బాట్ల ధరలతో నాకుపని.
చినుకునై జీవనది తోకలసి సింధువులా చిందులు త్రొక్కే నా ధ్వని
నేను బాలల్లా అమాయకంగా నవ్వేపూల తలదాల్చి పూజిస్తాను.
నేను మాలలకు తలవంచి మాన్యత ఇస్తాను
అవి నా గళాన్ని అలముకొనుటలో నా సన్మానం చూస్తాను.
నాకు చాదస్తాలు పట్టవు, అవి ప్రగతి పేరుపెట్టుకున్నా గిట్టవు.
మమత నా జన్మస్థానం, సమత నా విద్యా విజ్ఞానం.
ఈ రెంటిలోని ఆనందానుభూతియే నా ప్రగతి సోపానం.
నాకు బుద్ధికన్న మనస్సుపై ప్రేమమిన్న.
నేను మనసుతో గూడిన మనీషతో మనుష్యుడనై యున్నా.
మనస్సు వీడిన బుద్ధి మగ సంసారం వలె రుచిహీనం.
బుద్ధిని గూడని మనస్సు పనికిరాని విధవ సమానం.
నేను నవతతో భూత దానవతను రూపు మాపుతాను.
కవితతో మానవతకు ప్రాణం పోస్తాను.

ఈర్ష్యాసూయా ధూమాలతో క్రోధాగ్ని జ్వాలాళితో
హృదయాన్ని కాల్చేసే వైరం నాకు పట్టదు.
తల్లిప్రేమ నాది, పిల్లల భయపెట్టి బుద్ధి చెప్పుట గిట్టదు.
నేను విందునై మందుగా మారి విషమజ్వరాన్ని అణచే తేనె తెట్టెను.
నేను సువర్ణాల్లో పొదిగిన సుగుణ మణుల పెట్టెను.
సోదర మానవుల వీడిన కథలు నాకు పట్టవు.
వర్ధమానాన్ని వర్తమానాన్ని మ్రింగే భూతాలు నాకు గిట్టవు.
నేను కృతిని మీ సంస్కృతిని. నేను ఔచిత్యాన్ని. మీ వాచస్పత్యాన్ని
మనోబుద్ధులు వాగర్థాలై - పార్వతీ పరమేశ్వరులై
పార్వతీప-రమేశ్వరులై
కాంతా సమ్మితోపదేశాలతో అన్యోన్య ప్రేమ పాశాలతో
కుమార, మారాభ్యుదయా వాప్తి, వీర శృంగార రస కావ్య ప్రాప్తి
క్రాంతి శాంత్యా వాప్తి, విశ్వ విరాడ్రూపానికే స్వస్తి
నాలోనేను, విశ్వంలో నేను, అందరు నాలో, నేనందరిలో
నేను భయరహిత అద్వైతాన్ని, నేను నవరూప చైతన్యాన్ని.
నా పేరునేను, నేను విశ్వరూపాన్ని, ద్వైతంపై గల కోపాన్ని
నేను కవిని నా గేయం అహింసా క్రాంతి, నా ధ్యేయం విశ్వశాంతి.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

# సత్యం ~ శివం – సుందరం

నేను రాజును - సకలాక్షర పదాలను పాలిస్తాను.

నేను రాజరాజును – సకల రాజులకు

నా అక్షర సామ్రాజ్యంలో ఆశ్రయ మిస్తాను

నేను తరాజును -సకల ప్రజలను సమతా తూనికతో తూస్తాను.

బాట్లు - బంగారం విలువలు వేరు చేస్తాను.

మీరు క్షరాలతో అక్షరాలను తూకంచేయకండి.

మీరు నక్షత్రాలను నవరత్నాలతో కొని వేయకండి.

మీకు అందానికి ఒక ఆభరణం వేయాలనిపిస్తుంది.
ఆభరణాలెక్కువైతే అసలు అందం చస్తుంది.
నాకీ సన్మాన భారాలతో తల వంపుచేశారు.
నాకాళ్ళకు చేతులకు బంగారుబేడీలు వేశారు.
మీరు నాడు వేశారు, మీ పెద్దన్నకాలికొక పైడిగోలుసు.
నేను మీ తమ్ముణ్ణి నా కిదేమిటో ? మీకే తెలుసు.
నేను ఋషిని - నేను లోకపు నగిషిని.
నన్ను ఆశాపాశాల వల బంధిస్తారు.
నన్ను స్వార్థ పాఠశాలల్లో ఎందుకు చదువ వేస్తారు ?
నాకు కావలసింది అక్షర పరబ్రహ్మ యోగం.
నాకు కావలసింది నవరస బ్రహ్మపై అనురాగం.
నాకు కావలసింది కవితా కన్యకా వర భోగం.
నాకు కావలసింది కాలచక్రంతో కదలే పదవేగం.
నాకు కావలసింది ఈ అందాల సృష్టి.
ఈ సృష్టిలో ఆశలెరుగని సంతుష్టి.
నాకు కావలసింది మానవసోదరుల పుష్టి.
వేదనాగ్నిపై అపార ప్రేమ రస వృష్టి.
నాకు కావలసింది రాక్షసత్వాన్ని చంపే ఖడ్గ ముష్టి
దేశానికి ప్రాణాల బలినిచ్చే విజయేష్టి.
నేను సౌందర్యాల నారాధించే తిలకాన్ని.
తిలకానికి అందపు విందులిచ్చే ఫాల ఫలకాన్ని.
నేను ముడిచిన అందాల తల కట్టును. ముడి విడినా అందమిచ్చే జుట్టును.
నేను ఛందాన్ని, మీ స్వచ్ఛందాన్ని.

నేను మీ అందాన్ని. ఆనందాన్ని.
ఏడుస్తూ ఏడిపిస్తాను. నవ్వుతూ నవ్విస్తాను.
ఏడ్పుల నవ్వుల అట్టడుగులో ఏదో తాదాత్మ్యం చూపిస్తాను.
ఇదంతా నాటకమని తెలిపి సత్యానుభూతినే కలిగిస్తాను.
మంచియే మనకు ఉపాదేయమని చెప్పకుండా ఉపదేశిస్తాను.
మరొకరిని బెదరించి మీకు బుద్ధి వచ్చేటట్టుచేస్తాను.
పిచ్చిపిచ్చిగా ఏదో వ్రాస్తాను మీతో చదివిస్తాను.
అటుచూడండి నాకలపు చిత్రాలు — ఎముకల బోనులైన గాత్రాలు.
ఏమిటా జీవితాలు, ఎందుకు పనికిరాని చెరిగి పోసిన తాలు.
ఏమిటా రూపాలు, చమురు లేక ఆరిపోతున్న దీపాలు.
బట్ట చాలక బయట పడ చూస్తున్నవి, మానాలు.
రొట్టె చాలక పునాది లేని గోడలై కూలి పోతున్నవి ప్రాణాలు.
ఏవో తెలిసికోనండి మొదలా రోగ నిదానాలు.
నిలుపండి వారి మాన ప్రాణాలు.
ఏమిటా బ్రతుకలేని జీవాలు, చావలేక బ్రతికే జీవచ్ఛవాలు.
మరొకవైపు చూడండి మనవారి వైభవాలు, మననుగాంచి చేస్తున్నవి సవాలు.
ఏమిటా తరుగని ధనధాన్యాలు, ఎందుకు; వారికా వల్లని భోజనాలు?
ఏమిటా ఎవరులేని ఇంటిపై ఇంటికప్పులు,
ఎందుకా పులగం మీది పప్పులు?
అతివృష్టి అనావృష్టి ఏటికీ విభేద దృష్టి ?
కాలాకాశంతో కదలింది సృష్టి
ఎత్తువంపులను ఏకంచేసి కాలాకాశానికి కళ్ళెంవేసి
సేవ్యసేవక భావం వీడి చిన్నా, పెద్దా, అన్నతమ్ములు జత గూడి
గమ్యస్థానం కడు శీఘ్రంగా చేరుకోవాలె.

ఎందరి కృషితోనో పైకొచ్చి అంతా నేననే వాళ్ళను చూస్తే
నాకు అతికోపం.

సాయపడే సాటి సోదరుల మోసగించి పొట్టగొట్టేవాళ్ళ విషయంవస్తే
సంతాపం.

మనం మనవాళ్ళనే పరులని ద్వేషించడం బహుపాపం.
ఎన్నాళ్ళు పట్టుకుంటుందో జాతి కీ శాపం ?
మనలో మనకున్న ఈ విభేదాల వివాదాల నణచులే మన ప్రతాపం.
ఈ ప్రతాపమే మన యింటి సంధ్యా దీపం.
ఈ విషమ పరిస్థితి నెదుర్కొన డానికి మనమంతా కావాలె సిద్ధం.
నేను చేస్తాను, నా కలంతో, కాలంతో నిరంతరం యుద్ధం.
నా కలం ఖడ్గంకంటే పదును,
నా కవిత కాగితంపైనున్న ఎత్తువంపులు లేని చదును.
నానినాదం నరజాతి అంతా ఒక భూమాత గర్భశుక్తి ముత్యాలు.
ఈ సామ్యవాదాలు త్రికాల నగ్న సత్యాలు.
ఈ సమతా పథాల్లో నడచి, గమ్యం చేరుకుందా మందరం

సత్యం - శివం - సుందరం.

# కూలిపోయే కొమ్మ కొత్త చిగురెట్టింది

అణువులు, అణువులు; పరమాణువులు, అణువులు
అణువులు, పరమాణువులు, తోక తొంబైయారు రకాలు.
తమలో తాము ఒకటి కొకటి సఖాలు.
ఆడుతున్నాయి సూర్యుని కిరణాల్లో.
కూడి వీడుతున్నాయి అందాల పాపాయిల్లా.
సూర్యుని కిరణం విశ్వానికే స్వర్ణాభరణం.

అణు రూపమీ విశాల విశ్వాల సృష్టించి మహద్రూపమైన దేమొ ?
అన్ని పదార్థాల సృష్టి, స్థితి లయాలకు కారణాలై నావి ఇవి తామొ
అణువులోనుండి వచ్చిన బ్రహ్మాండంలా అవతరించిన దా వృక్షం.
అన్ని వస్తువుల కున్నది శుక్ల పక్షం కృష్ణపక్షం
పండుటాకులు రాలుతున్నాయి, పచ్చనాకులు వ్రేలుతున్నాయి.
ప్రతి వస్తువులోని ప్రయోజనము మహత్తరము.
ప్రాణి కోటికి సదా కల్యాణ కరము.
అణువే బ్రహ్మాండమైన దావృక్షం.
ఎన్ని ప్రాణులకో పెట్టింది దయా భిక్షం.
అద్దె అడుగని అవనితల్లి హస్తాల నీడ యీ వృక్షం
భూదేవి పట్టిన పుణ్యాల ఛత్రం ఈ వృక్షం.
దాతలు గట్టని ధర్మసత్రం ఈ వృక్షం
నీడల్లో నరులు, ఊడల్లో వానరులు; వానరులూ నరులూ,
క్రింద భిక్షులు, మీద పక్షులు పక్షులూ భిక్షులూ
పక్షపాతం లేని పరమ పుణ్య గంగ ఈ వృక్షం.
భూమి తల్లి పుట్టించింది. గతిలేనివారికిలా ఇల్లు కట్టించింది.
ఒకే అడుగుపై నిల్చి ఎండ వానలు సైచి
మౌనిగా తపస్సు చేస్తుందీ మహా వృక్షం.
దీనికి నాలుగు కొమ్మ లున్నాయి,ఆ కొమ్మల కెన్నో రెమ్మలున్నాయి
ఇది సజీవ పర్ణశాల వర్ధమాన పుణ్యాలీల.
దీనికి నాలుగు కొమ్మ లున్నాయి, అన్నీ సహోదరత్వం పెంచు
కొన్నాయి
పై కొమ్మతల, రెండవ కొమ్మ మొల, మూడవది కేలు, నాల్గవదే కాలు
కాలునే విరిచేసి కదలనీకుండా చేశారు రాకాసులు.

అదో! ఆ పై కొమ్మపై వాణి శుకా లాపాలు సాగుతున్నాయి
పికాలు పాడుతూ ఉన్నాయి.
రెండవ కొమ్మపై లక్ష్మి తాండ విస్తున్నది.
అనుకొన్న ఆశల పూలు ఫలిస్తున్నాయి.
అంతా పచ్చపచ్చగా నున్నాయి.
మూడవ కొమ్మపై వీర విహారంతో వానరుడు
మారబోయే నరుడు ఆడుతున్నాడు.
సకల శాఖలపై సార్వభౌమత్వం సాగిస్తున్నాడు.
నాల్గవ కొమ్మ కూలిపోతున్న కొమ్మలా కనబడు తుందేమి ?
ఈ నాల్గు కొమ్మలకు ఒకే స్కందము ఆశ్రయణం.
మూల ధనాన్ని జీవనంగా అన్ని కొమ్మలకు పంచి ఈయాలె.
కూలిపోయే కొమ్మకు చాలినంత జీవనం అందడంలే.
మొదటికొమ్మ "ప్రమా" రెండవకొమ్మ "రమా"
మూడవది "ఉమా" నాల్గవది కూలి పోయేది "శ్రమా"
ఈ నాల్గింటిని సాకే కన్నతల్లి "క్షమా"
మొదటి కొమ్మ పుష్పించి మధు సుధా రసాల చిందిస్తున్నది.
షట్పదాలు పదాలు పాడుతున్నాయి మధుసుధా మత్తతతో
రెండవ కొమ్మ ఫలించింది శుకరంభలు సుఖా లాపాలతో
ఆరగించగా మిగిలినవాని అవని రాలుస్తున్నాయి.
మూడవ కొమ్మపైనున్న వానరుడు అసంస్కార పరుడు.
స్వీయ సుఖానికే ఈ కొమ్మలన్ని సృష్టింపబడిన వన్నట్లు
విచ్చలవిడి విహారాలు, విరుపులు కొట్లు.

బలవంతుణ్ణి నేనే నని పై కొమ్మల్లోని పక్షుల బెదరిస్తున్నాడు.
కొమ్మల నన్నీ అట్టిటు ఊపి చెట్టుకు చెట్టు కదలిస్తున్నాడు.
పై కొమ్మల కెగ ప్రాకుతున్నాడు కూలిపోయే కొమ్మపై దూ
తున్నా(

ఈ వృక్ష మంతా నా సొమ్ము నా దయాధర్మంపై
నీ చావు బ్రదుకులని నమ్ము.
వృక్షంపై నా ఆడిన దాట, పాడినది పాట.
ఈ కొమ్మలన్నీ నాకు పీఠమీయాలె, వింజామర వేయాలె.
ఛత్రం పట్టాలె, కోట కట్టాలె, ఉపాలె ఊయాల.
పశువుల కెరయై శిశువుల ఆటలకు గురియై,
కూలి పోయే కొమ్మ కాలాని కెదురీదలేక నేలకొరిగింది.
అందరికీ అందే యీ కొమ్మను జుట్టుపట్టి వంచారు
పచ్చదనాన్నే త్రుంచార

అది తన ఔన్నత్యాన్ని గోలుపోయింది, కూలిపోయింది.
తన మాతృ వృక్షాని కది అంటీ యంట కుండ ఉండీలేకుండా ఉన్న(
శ్రమ కూలి పోయింది, క్షమకు జాలి వేసింది
పొట్ట కదుము కొన్నది, పట్టు ఓపి కన్నది.
వానరత్వాన్ని వంచించే నరుడు పుడతాడు
నీ ఔన్నత్యానికి నడుము కడతాడు.
అవని తల్లి కొమ్మలన్నీ నాకు సమానమే అని
కూలిపోయే కొమ్మనోదార్చింది, చెంతకు దార్చింది.
కూలిపోయే కొమ్మల ఊడలతో
ఉర్వి పొట్ట జొచ్చి కొత్త యిగు రెట్టింది.

# మానవతా వృక్షం

మానవతా వృక్షం, దాని కొమ్మలు వ్యాపించాయి విశ్వాంతరిక్షం.
నీవూ నేనూ, వాడూ, అదీ, మీరూ, మేము మనమూ
ఈ సర్వనామాలూ ఒకేచెట్టు కొమ్మలం, ఒకే కొమ్మ రెమ్మలం.
ఒకే రెమ్మ ఆకులం స్వామీ ! ఏ కులం ఐతే నేమి ?
ఏకులన్నీ కలిసి ఏక సూత్రంగా మారాలె.
వస్త్రమై మానాన్ని రక్షించే దీ దారాలే.

వేరు వలె మొదలు లేదు మొదలు వలె కొమ్మలేదు.
కొమ్మ వలె రెమ్మలేదు రెమ్మ వలె ఆకులేదు.
దేని దాని పని వేఱె ఈ అన్నిటినీ కలిపేది ఒకే ఒక వేరే
అది చూడక నీవు వేరు, నేను వేరని ఎందుకంటావు?
మానవతా విభాగం మహా పాపం, తీరని మనస్తాపం
ఎవడు రాజు, ఎవడు రైతు, ఏమిటీ కులాలు?
చెపితేనే కాని తెలిసే కులానికి ఎందుకింత ఛలం, ఎవరిచ్చిందీ బలం?
చెప్పకుండానే తెలిసే మానవత కసలే లేదా స్థలం? ఏమిటీ మతాల
ఎచటిపీ భేదాలు, వాని రక్షించుకునే వాదాలే వేదాలా?
నేను నరుడ! నా తండ్రి ఆది మనువు!
అతని వారసత్వమే ఈ నా తనువు
ఈ మానవతా మహా వృక్షాన్ని ఎవడు ముక్కలుగా నరికి వేయ
గలడు
ఎవడా ఖలుడు? ఎవడా రాక్షస మహా బలుడు?
వృత్తులతో నన్ను విడదీయ లేవు, వర్ణంతో నన్ను కడద్రోయలేవు
భూఖండ విభేదాలు జూపి, పాఖండీతనంతో పరుడని నిరూపించలేవు
అఖిల నదులు జలధులనే అగడ్తలు ఆపలేవు నన్ను
నిఖిల పర్వతాలు అనే అడ్డుగోడలు నిరోధించలేవు నన్ను
పక్షినై ప్రక్కింట వ్రాలుతాను, చేపనై యీ పయోనిధి
అవలి తీరాన తేలుతాను
చిత్ర భాషా విభేదాలు రంగు భేదాలు, ఛేదించే గొడ్డళ్ళు కాలేవు నాకు
ఈ మహావృక్షం నుండి ఒక కొమ్మను నరుకబోకు
నరికితే వేరుబడిన కొమ్మయే చస్తుంది. మరల ఆ స్థానంలో
ఆలాంటి కొమ్మతో
ఆ మహావృక్షం నిలుస్తుంది, ఫలిస్తుంది.

నీ వలెనే ఉన్న నన్ను నీచ మృగంలా చూస్తున్నావు
నీ వెవడవు? నీది ఉన్మాదమా? లేక ప్రమాదమా?
ఇది నీ వితండ వాదామా? ఇదే నీ వేదమా? మత ప్రబోధమా?
ఒకే దేహంలోని శిరం, ఉరం, కరం, చరణం వేరని నరికే కసాయీ
మానవత్వాన్నే దానవ రూపంలో దగ్ధం చేసే ఆతతాయీ
నీ చర్య ఘమార్హం కాదు. దీని ప్రతిఫలం నీకు తినిపిస్తుంది చేదు.
నా వలెనే ఉన్న నిన్ను నేను చంపలేను సోదరా!
నీకు నా పై వున్న ద్వేషాన్ని నీ స్వార్థ పాశాన్ని
కాల రాచేస్తాను, నేల మట్టం చేస్తాను.
నే రోగినే చంపే వైద్యుణ్ణి కాదు.
రోగాన్ని నివారింప జేయడానికే వైద్యం.
స్వార్థ త్యాగం, ప్రేమామృత భోగం
సాటి సోదరునిపై యనురాగం
నాకు నా వేదంలోని ఒక్కొక్క భాగం.
నిన్ను మార్చలేదీ గన్ను–ఇది నిన్ను చేస్తుంది మన్ను.
సుకవీంద్రుని పెన్ను - అంజనం వేసి పొరలకోసి నీకిస్తుంది కన్ను.
భయం అంగాలనే మారుస్తుంది, ప్రేమ అంతరంగాలనే తీరుస్తుంది.
నేను సాధించేది కక్షగాదు, నీ నా రక్ష
ఉప్పెనవలె వస్తూ ఉంది ఉవ్వెత్తుగా ప్రవాహం
నీ ఎత్తైన ఇసుక దిన్నె దానిలో నిల్వడం సున్నె.
శాంతంగా వస్తున్న క్రాంతి ఈ మహానది

# ఎవరు మీరు?

దినకరుని పట్టాభిషేక వేళ కనుల నీరు గార్చే వారెవరు మీరు?
వినిపించు కోరేమి, విలపిస్తూ వస్తున్నారేమి?
విచిత్రంగా ఉన్నది మీ నడక తీరు.
మీకు మీ యేడ్పులే విన బడుతాయి, మీ కష్టాలే కన బడుతాయి
మీకు నా, నా అనే నానాత్వపు నాలుకే ఉంది స్వామీ!
మనము, మనము, అనే మనమే లేదేమి?

అంతా ముందుకు నడిస్తే భూతాల్లా మీరు వెనక్కు నడుస్తారేమి?
కనులున్నది ముందుకు, గతి యన్నది వెనక్కు, మీకిదేమి?
మీరు ఎలా గమ్యం చేరుకుంటారు? పండ్లు విరుగ పడి పోతారు.
కుండ బగల గొట్టి నీరు ద్రావగా చూచే గ్రుడ్డివాళ్ళు మీరు
మురికి నీళ్ళతో బట్టలు తెల్లజేస్తామనే అవివేకుల తీరు.
పడవ-చెక్కలు చేసి విప త్సముద్రం దాటుతామనే అజ్ఞానులు మీరు.
మీరు మమ్మల్ని భయపెడుతున్నారు,తోడ్తో మీరు భయపడు తున్నారు.
మహా లక్ష్మి జనక స్థానాలైన మహా సముద్రాలై పోయినారు.
మీ వద్దకు వచ్చిన మాకు త్రాగుటానకు మంచి నీళ్ళైనా పుట్టవు.
స్వార్థానికే తప్ప సంఘానికి పనికిరాని పెత్తనాలు మాకు గిట్టవు.
మీరు మహా భోగులు, పరుని పచ్చదనపు గాడ్పులంటేనే
భగ్గునమండే అగ్గి గుండాలు.

మీరు కోటికి పడగెత్తిన మహా భోగులు.
అందుకే భయ పడతారు భయపెడతారు
దరిజేరుతేనే బుసకొడతారు, విషం గ్రక్కుతారు.
మీరు మహా భోగులు, ఎదుటి వాని అభ్యుదయం చూచి
యేడుస్తుండే రోగులు.

మీరు మీ నీడనే చూచి ఉలికి పడే పిరికివారు.
పెద్ద తన మనే కల్లు త్రాగి ఇల్లూ ఒళ్ళూ మరచి
పెడదారి పడుతున్నారు. పడిపోక తప్పదు.
మీలాంటి అప్రయోజకులు సంఘంలో ఎందరుంటేనేమి ?
సున్నాల నెన్ని వేసి కూడినా లాభం సున్నాయే.
గుడ్డి కన్ను తెరచినా మూసినా ఫలితం దృష్టి సున్నాయే.
సున్నా రేఖను ఎన్నిసార్లు చుట్టినా ఉన్నచోటికే వస్తాము
ప్రగతి సున్నాయే.

ఎవరు మీరు దినకరుని పట్టాభిషేక వేళ
ఏడుస్తూ వస్తున్నారు, ఎవరు మీరు?

# శాంతి కపోతి.

కా లాకాశంలో శాంతి కపోతి.

భూత పుచ్ఛంతో వర్తమాన పక్షాలతో

భవిష్య దభ్యుదయ దృష్టితో, సకల మానవ సౌఖ్యాల సమిష్టిగా

అఖిల వర్ణాల సమైక్య వర్ణమైన అకలంక శ్వేత వర్ణంతో

అంబ రార్ణవంలో అందంగా స్వచ్ఛందంగా

శాంతి సందేశం గొని అహింస ఆజ్ఞనుగొని

వచ్చి ప్రాలి మండల భ్రమణం చేస్తున్నది.
మానవతను చూస్తున్నది.
అభ్యుదయ సుప్రభాతాల నాలాపిస్తున్నది.
ప్రాణం బడిన పూల తెప్పల్లా భ్రమణం చేస్తున్నది.
ఆ ప్రక్క చూడండి, అమ్మయ్యో నల్లత్రాచులు.
హాలాహాల ప్రవాహంలా, కాలరాత్రి ప్రతినిధుల్లా
పుట్టల చీకటి కొట్లనుండి పొంచి, పగపెంచి
పరువెత్తి వస్తున్నవి.
స్వయంగా వక్రగా ముళ్లై -పర రంధ్రాన్వేషణం చేస్తున్నవి.
అంగిట్లో విషం, అలరు మాలలాంటి వేషం.
తలపై మణి భూషణం, రెండు నాల్కల సంభాషణం.
శాంతి కపోతాన్ని స్వాహా చేయాలనే దుర్బుద్ధితో
కసు బుసు లాడుతూ పగ బట్టి బస బస వస్తూన్నది.
ఇంపుగా విశ్వవృక్షంపై పెట్టుకున్న దాని యింటికే
ఎసరు పెడుతున్నది.
బుస కొడుతున్నది, కసి దీర్చుకొనడానికి కాచేయ జూస్తున్నది.
ప్రాకి వస్తున్నది, దాని నమ్మరాదు; దీని నో రంతా చేదు.
చెవులులేక వింటుంది కాళ్ళులేక నడుస్తుంది.
కూసాలు విడుస్తుంది.
పదుగురేకమై రండి, ఇరవై చేతుల నెత్తండి.
పదుగురిలో పాము జావ దంటారు.
పదుగురేకమై రండి ఫణ మెత్తకుండ కొట్టండి.
ప్రాణం తీయకండి, పండ్లు మాత్రం పెరికేస్తే చాల్లెండి.
అదిబ్రతికి చస్తుంది, చచ్చిబ్రతుకుతుంది.
శాంతి కపోతిని సంరక్షించండి
కాంతి కవాటం తెరువండి.

# చీకటి రాకాసిని ఉరి వేయండి.

నీ లాంబరము గట్టి కా లాంజనము బెట్టి
కాటుకల పులుముకొని కందెనల నలముకొని
చీకటి రాకాసి జడల విరబోసి
దశ దిశల ముఖాలకు మసి బూసి మాయ జేసి
మబ్బు తెరలు వేసి వాస్తవ జగత్తును దాచి
ధన మాన ప్రాణాలు దోచింది. దారి కాచింది.

నిశీథ పిశాచి నంగనాచి, బూచి తానే యట కాణాచి.
తెల్లవారకుండా దాచేస్తున్నది చీకటి
నల్ల ధనానికి చేస్తున్నది దినాని కొక వేకటి.
ఈ చీకటి యండ చూచుకొని జగజగా మెరిసే ఆ చుక్కలు
స్వార్థ మహాంధకారంలో తాము మాత్రమే మెరుస్తు ఆడుతున్నవి
తైతక్కలు
సకల జగత్ప్రకాశకుడగు సవితకు దూరంగా ఉంటాయి యీ నక్కలు
వాటి యాశలు అవధిలేని అంతు దొరకని ఆకాశ అవకాశ సముద్రాలు
అదో ! అవి మా అంధకారపు బ్రదుకులచూచి చేస్తున్నవి పరిహాసాలు
నిశీథంలో తమ వికార ఆకారాల దాచేస్తున్నవి గుడ్లగూబలు
దినానికి శాపనార్థాలు పెడుతూ ఘనమైంది తమస్సని ప్రచారం
చేస్తున్నా వీ దేబెలు
మహా లక్ష్మికోసం మంత్ర జపాలుపేనే ఈ మడి బట్టల దొంగలు
మీనాలకోసం పుణ్య తీర్థాల్లో ధ్యానాలు చేసే కొంగలు
అంటున్నారు వచ్చింది మహా లక్ష్మి దయా ప్రవాహం
ఇక వీడదు మా గేహం
ఎన్ని కమలాలు మొగం మాడ్చుకుంటే నేమి ? ఇక నుండి లక్ష్మికి
ఈ భక్తుడే స్వామి
ఈ మాట విన్న ఇందిరకు కోపం వచ్చింది వైకుంఠ ఆనంద భవనం
వీడి వచ్చింది
విప్పండి మిత్ర కరాలు ప్రాచీ గేహ కవాటం
చీకట్లు నా శత్రు కూటం
తలుపుల దట్టి ఇలా ఆమె ప్రకటించింది. చీకటి కథ వికటించింది.
చీకటి దొంగల మొగాలు వెలవెల బారుతున్నాయి
రాకాసుల గుండెలు విల విల లాడుతున్నాయి

పదముంచే ఉద యేందిర అరుణ రేఖా చరణ మంజీరాల్లో
ఘలు ఘల్లున నినదించే గజ్జల మువ్వల్లా
కల కలా రావాలు చేస్తున్నాయి శంకుతాలు దిగంతాల్లో
చీకటి కవాటం త్రోసే టప్పుడు కిల్లు అను ధ్వని తరాంగాలై
కోడి కూసింది చీకటి ప్రాణం తీసింది.
కమల కాంతులలో ఇందిరా ముఖం వికసించింది
దశ దిశా సతులు వెల్తురు పత్తి పురులు వేసేండి
చీకటిని ఉరి వేయండి.

# నేను మానవుణ్ణి.

ఆద మనే ఆది మనువు ఆత్మజుణ్ణి మానవుణ్ణి.
మేదిని గల నా మానవ సోదరుల్లో నే నొకణ్ణి.
అవని యంతా నా యిల్లు - ఆకాశం నా పందిరి.
పర్వతాలు నా యింటి ప్రాకార కుడ్యాలు.
ఈ నదీ నదా లన్నీ నా యింటి పొలపు వంట కాల్వలు
విధు భానులు నా యింట్లో వెలుగు లిచ్చే దీపాలు.

ఒకే కుటుంబంవారం, ఉర్విని గల మానవులం.
అన్యుడ నే ననువాడే అజ్ఞానుడు దయనీయుడు.
అందరి కీ యింటి మీద అధికారము సమానము.
మానవ సోదర ప్రేమ లే మా కున్న పెన్నిధానము.
ఆద మనే ఆది మనువు సూనుడ నే మానవుణ్ణి.
మేదిని గల ఈ మానవ సోదరుల న్నెనొకణ్ణి.
అందర ప్రవహించు రక్త మవ్వదే, దేహములె వేరు.
అన్ని గం గాంబువులే, కుండలదే మారు పేరు.
అందరు మానవులకున్న యవసరాలు సమానము.
మా అందరిలోన ఉన్న మమత లన్ని సమానము.
అన్నం, వస్త్రం, యిల్లూ అందరికీ అవసరమే.
ఇంద్రియ ప్రియ వినోదాలు ఎల్లరకూ సుఖ కరమే.
అవసరాల ప్రభుత్వంతో అర్థించుట నా హక్కు.
సంఘో న్నతికై యెప్పుడు శ్రమించుటలు నా బాధ్యత.
ఆర్థిక, సాంఘిక, సాంస్కృతి కార్హ త లవి సమానమే.
మానవుడను నేను విశ్వ మానవత యే నా 'జాతి'
సోదర మానవుల సమత జూచుట యే నా నీతి.
సోదర మానవుల మమత జూచుటలే నా ఖ్యాతి.
అఖిల సోదర ప్రేమ యే ఆరని మా యింటి జ్యోతి.
ఆద మనే ఆది మనువు ఆత్మజుణ్ణి, మానవుణ్ణి.

# సమతా దీపం.

మమతా ఆజ్యం పోసి వెల్గించు సమతా దీపం.
ఆ దీపంలో నీకు దర్శన మిస్తుంది విశ్వ రూపం
మానవునితో మనసు పుట్టింది.
మనసులో ఉన్న మంచి గుణం మమత.
మమత కోరేది సాటి వారితో సమత.
సమత లేని సమాజం, జబ్బు పడిన రోగి.
ఆ రోగం బాగు పరచే వైద్యుడు త్యాగి.

స్వార్థం వ్యక్తికి సమ పాళంలో ఉంటే భోగం.
స్వార్థం ఎదుటి వాణ్ణి చంపే అంతగా ఎదిగితే అదే రోగం.
వ్యక్తి సమాజ మనే వస్త్రంలోని ఒక దారం.
వస్త్రాన్ని విడిచి వేరైన దారం నిస్సారం.
దానికి లేదు ప్రాణం. అది దాచ లేదు మానం.
వ్యక్తి సమాజ సింధువులో ఒక బిందువు.
సింధువును విడిచిన బిందువు క్షణంలో అంతర్ధానం
అది నిల్పలేదు ప్రా ).
ఈ కమలం విశ్వ మందిరంలోని దీపం.
సమాజం నిజమైన విరాట్ స్వరూపం.
సమాజ ద్రోహం మహా పాపం, అది వ్యక్తిత్వాన్ని చేస్తుంది లో ).
సమాజ స్నేహం ఆత్మోద్దీపనం, అది వ్యక్తిత్వాని
కిస్తుంది అనంత స్వరు ).
నానాత్వంలోని ఏకత్వం సమాజ బుద్ధి.
నానాత్వంలో ఏకత్వ దృష్టి అద్వైత సిద్ధి.
వాడే నే ననే ప్రేమ ఎదుటివాడే నే ననే ప్రేమ.
అద్వైత సిద్ధికి "సోహం" అనే మహా మంత్రం.
సమాజానికి "దాసోహం" అనడమే విశిష్టాద్వైత గణతంత్రం.
పదార్థాన్ని విడిచిన అణువు యథార్థానికి లే దన్న ట్లనిపిస్తుంది.
తలను వీడిన వెంట్రుక, ఇలను వీడిన ప్రాణివలెదాని అందమే చస 3.
మమతా ఆజ్యం పోసి వెల్గించు సమతా దీపం
ఆ వెల్గులో దర్శించుకో అద్వైత స్వరూపం.
దానితో నీకు సమకూడుతుంది సకల భయ విముక్తి.
దానికై కావాలె నిష్కల్మష సమాజ భక్తి.
మమతా ఆజ్యం పోసి వెల్గించు సమతా దీపం.
ఆ దీపాన్ని ఆర్పబోయే కలభ ప్రతాపం.
క్షణంలో ఔతుంది మసి రూపం.

# బలిని పాతాళం తొక్కాలె.

"దరిద్ర నారాయణుని దశావతారాలల్లో
వామనుడు త్రివిక్రమ వైభవాల్లో విశ్వ విరాడ్రూపాల్లో.
బలిని పాతాళ మంట తంతున్నాడు.
ఇల నంతా కొలుచు కుంటున్నాడు.
గడ్డి గాదం మేసే లేడిని పులి చంపి తింటున్నది.
రాక్షసులు దుర్బలుల యజ్ఞ పశువులుగా బలి నిస్తున్నారు.
అనేక నర మేధాలతో అఖండల పదవిని "బలి"గా పాలిస్తున్నారు.

భూమి నాదే - ఆకాశం నాదే- సముద్రాలు నావే.
సమస్త దిక్కులు నాయింటి పాన
నేను బలిని, నీవు నా స్వార్థ భూతానికి బలిగావాలె.
నే నిస్తే నీవు తినాలె, నే చెప్పిన మాట వినాలె.
నే పెడితేనే నీ కడుపు నిండు- నాకు నమ్మిన బంటువై యుండు.
నే నిచ్చేవాడను, నీవు బిచ్చగాడవు
నీకు నే పెత్తలను నీవు నా తొత్తువు.
నీవు నా ముందు చాలా చిన్నవాడవు. నేను నీకు తలపై నీడను.
చిన్నవాడు పెద్దవాడగుట ప్రకృతి స్వభావం.
వామనుడ నైనా నేను విశ్వ మానవుడ నైనాను.
విశ్వ మానవులు నే నైనాను. నీ ముందు బిచ్చగాడనై వచ్చాను.
ఆకాశం నీరు వెల్తురు గాలి అందరి వెట్లో భూమీ అందరిది.
నేను ఈ భూమాత బిడ్డనే నాకు అన్న మిచ్చి పోషించిం దీ గడ్డ
ఈ ప్రకృతి ఐశ్వర్యం దాని బిడ్డ లందరిది.
అవకాశ వాదులు కొందరు లయ వేయగనే అవనీ భాగం నీది కా
నీవు నా కిచ్చువాడవు కావు. నేను నీముందు బిచ్చగాడను కాదు.
నీది కా దీ విశ్వం, నీవు కావు విశ్వ దాతవు.
ఇ దంత విశ్వరూపానిది, ఇచ్చట బుట్టిన ప్రతివానిది.
మంచి మాటకు నా భాగం నాకు ఇచ్చివేయి.
పోనీ ఎట్లాగైతేనేం దానమన్నా చేయి.
వద్దంటున్నా డసుర గురువు, ఈ చెడ్డ సలహాలే వాని బ్రతుకు దెరు
పుణ్యమని భూదాన యజ్ఞం చేశావు,
పాతాళం బట్టి ప్రాణాలతో నైనా బ్రదికావు
నీ వొక దాతవు కావు, నా వంతు నా కిచ్చావు.
దరిద్ర నారాయణుడు దశావతారాల్లో
వామనుడు త్రివిక్రమ వైభవాలతో విశ్వ విరాడ్రూపంతో
బలిని పాతాళమంట నణచి వేశాడు.
ఇల నంతా కొలుచుకొని పంచి వేశాడు.

# సహస్ర దళ మహా పద్మం.

మానస సరోవరంలో పుట్టిన మానవ పద్మం వికసించ నీయండి.
మిత్ర కిరణాలు సోకితేగాని జీవనాలు సాకితేగాని విప్పారదు.
అనంత దళాలతో ఐకమత్య మృణాళ నాళంపై
అమృత మధువుల కురిపించి అందంగా హసించి కన నింపై.
అనేక దళాలతో ఒకే సద్మ మైన పద్మాన్ని
మానవ పద్మాన్ని మానస పద్మాన్ని వికసించ నీయండి.

సకల దళాలకు సమంగా పీఠముంచి, సమంగా జీవనం పంచి
హసించే పద్మాన్ని త్రుంచకండి పెంచ రండి.
దళాలు త్రెంచి కళా వికాసాన్ని నలింపు జేయకండి.
వేయి దళాలతో ఒక పద్మం,? వేల పద్మాలతో ఒక లత,
వేల లతలతో ఒక సరోవరం, సంతోష నగరం
దళాలలోని సమత, అవి నిర్బ్రక్రమత.
అవి పరస్పరం కలిసి యుండే మమత.
వానిని వరించి కవ్వించి నవ్వించే సవిత.
నేత్ర పర్వం ఆనంద మయం సర్వం.
మదోన్మత్తుడై కఠిన చిత్తుడై పూలత్రెంచి
నేలపాలు గావించే వా డెవ డా కరి.
కరి గాదు వాడు అధిక - అరి— అధికారి.
కంఠీరవమై వానితో పోరి కమలగత రమాదేవిని కాపాడండి.
పాడండి శాంతి గీతం సౌఖ్య రాగంతో మధుకర వీణ తంత్రులపై
ఓ నవ కవీ! రాగ రవీ! ప్రభాత చ్ఛవీ !హర్షించు.
నీ కవితా సుధా రసాల వర్షించు కమలాలకు జీవనాల నించు.
నాశ్రమ బిందు సందోహం నవ్యానంద మహార్ణవంగా నిలిచి
నవ రత్నాల ప్రసవించాలె, నాలక్ష్మిని కని పెంచాలె.
నాకాన్ని అందరికి పంచాలె
లోకాన్నే అజరామరం చేయాలె, పద్మాలు పూయాలె.
తరంగాలు ఊయెల ఊచాలె,
శీకరాలు వింజామరలు వీచాలె.

# సార్వభౌమ వృక్షం.

మొలవేసిన మట్టి విత్తు స్థలమంతా నాదేనని
కల్ప వృక్షానికైనా కాస్త చోటు లేకుండా చేసిందవని.
పగడాల రూపపు ఫలాలను పక్షులు మేసి
జగడాలు చేసి ఛేదిస్తున్నవి, చక్రవర్తుల ఖిలాలు రెట్టవేసి.
కొమ్మ కొమ్మ కొక ఊడజారి క్రొత్తగా నిర్మిస్తున్న దొకొక మేడ.
కడమ పైరులు జొరపడకుండ కట్టింది ఆకాశమెత్తు గోడ.

అణగి మణగి అరంగుళం తలెత్త కుండ శిరము వంచే.
గులాము వలె కొలుస్తున్నది గుడ్ల పల్లేరు కంచె (దానిచుట్టు)
ఇలాగా సార్వభౌమ వృక్షం పాలిస్తున్నది స్వార్థ పక్షం.
సుడిగాడ్పు విప్లవాలకు చూపిస్తున్నది తన వక్షం.
గొడ్డండ్లు వచ్చి కొమ్మల కొట్టి వేశాయి. గునపాలు తవ్వి చూశాయి.
రావణ శిరాల్లా కొమ్మలు,ఒకటికి పది మొలిచి నిల్చి
ఏం జేస్తారన్నట్లు చూశాయి.
సూర్యుని కిరణాల నైనా చొరకుండా చేశాయి.
పాతుక పోయిన వేళ్ళు పాతాళ లోకపు రుచులకు దారి తీశాయి.
కళ కళలాడుతున్నది. గల గల పాడుతున్నది.
మలయ మారుత రాగాలల్లో మత్తెక్కి తల లాడిస్తున్నది.
పర్ణాల హస్తాలతో పాటకు లయ వేస్తున్నది.
వ్రేళ్ళతో పాతాళం, వెడల్పుతో, భూగోళం,
ఔన్నత్యంతో అమరలోక మూలం.
త్రిలోక సార్వ భౌమత్వం తీర్చిదిద్దాను, అన్నిటికన్నా నే నే పెద్దను
దేశ కాలాల్ని గెల్చి తర తరాలు స్థిరంగా నిల్చి త్రివిక్రముడనైనాను-
ఒకటి పదిగా మొల్చి ఉర్వినంతా కొల్చినాను
నా ప్రగతి కావ్యానికి కామా, ఫుల్ స్టాప్ లేదు.
నా కథకు భరత వాక్యం రాబోదు
ప్రక్క చెట్టు మాత్రం తక్కువ తిన్నదా? అదీ అదే పాట పాడలేదా?
కొమ్మ కొమ్మ ఒరిశాయి, కోపాగ్నులు మెరిశాయి.
గాలి కా మంటలు విరిశాయి, జ్వాలలూ ఝుంఝులు
ఝుంఝులూ జ్వాలలూ అనల ఝురులూ ప్రవహించాయి.
సార్వ భౌమ వృక్షాన్నే ముంచాయి.
వేల యేండ్ల కృషి క్షణంలో బి పోయింది మసి.
ఆ స్థలాన గరక పోచలు మొలిచాయి.
అన్న దమ్ముల వలె ఆనందంగా వెలిశాయి.

# నళ వచ్చింది.

నళ వచ్చింది, నా దేశానికే కళ వచ్చింది
నళ వచ్చింది వచ్చింది, నాకేం తెచ్చింది?
పట్టెడు మెతుకులు లేక పాతాళానికి ఈడ్చుక పోయిన కళ్ళు.
పరమ అసహ్యంగా ఉన్న పాత చింపి పేలికలతో కప్పబడిన ఒళ్ళు
ఇదేనాకళ? మరి ఇదే, నాకళ- తలచుకుంటే భయమేసే పీడ కల.
కలవారిదే కళ. కలవారిదే యిల, కలవారిదే కాలం. వారిదే
వైభవేంద్ర జాలం.

నళ వస్తేనేమి? దాని నాయిన్నవస్తేనేమి? సొత్తులేనివాడే తొత్తు.
లక్ష్మిప్రసన్నంకానిది జీవనం క్రచ్చపొదల వనం ఎలాప్రసన్నమౌతుంది?
అతి కష్టించిన శ్రమ జలాలతో, అర్ఘ్యపాద్యాదులిచ్చినానే,
పరిశ్రమతో, ప్రయాసంతో బడిబడి వచ్చే ఊర్పుల వింజామరలుగా
విసరినానే,
కండలు కరిగించి నిండారు భక్తితో నివేదనం సమర్పించినానే,
కాలుతో తన్నినా, కఱ్ఱతో బాదినా, మొండి సహనంతో
బండ చాకిరి జేస్తూ
చిరు నవ్వుల పూలతో లక్ష్మిపుత్రుల నిరంతరం పూజించానే,
కాని ఆమె ప్రసన్నం కాలేదు కడకు కానిదైనా ఈయలేదు.
మోసగాండ్రకు దాసురాలైంది. దొంగల దౌర్జన్యాలకు
నంగి పోయింది.
రెండు నాల్కల విష సర్పాల అండజేరి కోటికి పడగెత్తింప జేసింది.
మాయ లేడి వ్యాపారుల మహేంద్రజాలంలో తగుల్కొని పోయింది,
బండ గుండె గల పాలకుల పంజాలో పంజరపు చిల్కయై
చిక్కుకొని పోయింది.

* * * *

“పాత కాలం గాదు, భూత కాలం గాదు. మానవత మేలుకొంది.
సమత పల్లకెంది.
ఆరవై చెప్పు ఇక నీకు పట్టిన భూత పీడ వదలిందనుకో” అంటున్నాడు.
నన్ను తమ్మునిగా తన భాగ స్వామిగా తనంత వానిగా జేయాలనే
ఒక పెద్దన్నగాడు;
మోసాల వేషాలిక సాగవట, లంచాలకథ ఐతే కంచికే పోయిందట.
కల్తీల ఆటలు కట్టు బడి నాయట; వెట్టి చాకిరి మహా వృక్షం వేళ్ళతో
కూలి పోయిందట;
అంబరాల చుంబించే అధిక ధరలు ధర మీదికి అంది వచ్చాయట.

సంకల్పాలు సరియైనవే ప్రయత్నాలు బాగానే ఉన్నాయి
ఇరవై చెప్పినా యిన్నూరు చెప్పినా యింకా తప్పలేదు మన ముప్పు,
కావాలె కనువిప్పు,
అసలీ అగాధపు ఎత్తు వంపులు సమమై హాయిగా మన జీవిత రథం
అనుకున్న చోటికి చేరుకొనడం మనికి ఉన్నంతలో చూస్తామా! నేస్తం?
నా అన్నతా నొకటి విచారించి చెపితే నేను వేయి విచారించి
అంటున్నాను
ఒకటేమిటి! వేయి యేమిటని యంటారా! నామాట వింటారా?
వినండి నా అనుభవం నేను చెబుతున్నాను.

* * *

ఒకటికి, కాలు క్రింద బెట్ట నీయని కార్లు, వేయికి చెప్పులు లేక
ఎండలో మాడే కాళ్ళు.
ఒకటికి సీమ డిగ్రీల చదువులు, పదవులు,
వేయికి తమ గోడు చెప్ప కోలేని పెదవులు అవి వట్టి మొదవులు.
ఒకటికి కట్టా విడువా బట్టలన్నీ పట్టే,
వేయికి కట్టు కొనడానికి లేదసలు బట్టే.
ఒకటికి వల్లని భోజనాలుగా మేవాలూ, కోవాలు.
వేయికి త్రాగటానికైనా లేవు జావాలు.
ఒకటికి మేడలకు వేశారు వెన్నెల్లాంటి సున్నాలు.
వేయికి అన్నం బట్టా యిల్లూ ఇవి మూడూ సున్నాలే.
ఒకటికి యింటికి పచ్చాల తోరణాలు,
వేయికి యింట్లో దరిద్ర పిశాచంతో రణాలు.
దేశానికి స్వాతంత్ర్య మొచ్చింది, సంక్షేమం తెచ్చింది.
రాకేం అన్నీ ఉన్నవాళ్ళనుకుంటే మాకేం!
నళ వచ్చింది నాకేమి తెచ్చింది; నిజాని కిది ఉగాదేనా?
ఉంటే ఉగాది, లేకుంటే ఏకాదశై యుంటుంది.

రెండూ మన పండుగలే, దేన్ని కాదనాలి?
పండుగనాడు సంతర్పణం బాగానే పెట్టారు.
తిన్నవాడు తింటున్నాడు ముందరబడి; లేనివాడు తింటున్నాడు
కాళ్ళబడి

ఏమిటి? తిట్లు. లేదు పొమ్మని చీవాట్లు.
పిల్లవాన్ని పిలిచిగూడ పెడుతున్నారు, మధ్యగ్రద్దలు వచ్చితన్ని.
అమాంతం అందుక పోయె. చేతి కందినా నోటి కందదాయె
అదో చూడండి! మాన్యుల చేతిలోని ఆట బొమ్మలు సామాన్యులు.
కూలీలను గోలీలుగా ఆడు తున్నా డా మిల్లు యజమాని.
పాలేరు రక్తం పాయసంలా త్రాగు తున్నా డా భూమి కామందు
గట్టి వాడు వెట్టి వాని నోట్లో ప్రాణ వాయువు నింపి
ఆటల పోటీలో ఫుట్ బాల్ లా అటూ యిటూ తంతూనే ఉన్నాడు
పట్టణాల్లో ఉగాది పల్లె గుడిసెల్లో మనాది.
"నళ వచ్చింది కను విచ్చింది. తెలవారింది మలయ మారుతం వీస్తుంది.
ఉదయంతో హృదయాబ్జాలు విచ్చాయి. తేంట్లు క్రొత్త సందేశం
తెచ్చాయి.
ఇరవై చెప్పు ఇక యిన్నాళ్ళటి చీకటి యాటలు సాగవు"
అంటున్నారు.
ఐనా ఈ యుగాది నూత్న యుగాదిగా యగు గాక.

# సమష్టి దీసృష్టి.

ఏమిటా నీ సృష్టి, ఇదేమిటీ? ఎవనికి వాడే వ్యష్టి
ఉన్నవానికే ఉంది కండపుష్టి లేనివానికి దినమంతా తిరిగినా
దొరకదు ముష్టి,
కష్టించుచున్నవి ఆ బ్రతుకులు కడుపునిండా దొరక విన్ని మెతుకులు.
అన్నవస్త్రాల కనే స్వార్థం దగ్గర కెళ్ళి
అయి పోయి నాడు దాని నోట్లో ఖారా కిళ్ళి.

స్వార్థపు గురుత్వాకర్షణశక్తి, లఘుత్వం దానికి ఐపోయింది భుక్తి.

*　　*　　*　　*

ఏమిటీ సంఘం-ఎవన్ని జూచినా! తానే రాజుననే నాటక రంగం.
ఎవనికేయి వాడే చూచు కొంటున్నాడు. ఎదిరి వాన్నిచూచే
వాడే లేడు.

ఎంతసేపు తన గోడవే, ఎంతవరకూ తన గొప్ప తనమే.
ఎవనికీ పదవిలో ఉన్నంతలోనే దోచాల్సింది ప్రజాధనమే.
స్వార్థ పరులగు అధికారుల దృష్టితుపాకికి గురి కావలసింది యెపుడీ
బీద జనమే.

ఎవని వైభవంలో వాడే మత్తుడు. ఎదుటివాడు తనకు కావలె
భృత్యుడు.

ఎవన్ని చూచినా మేధస్సులో వంచనా బుద్ధి, మనస్సులో స్వార్థవృద్ధి.
వపుస్సులో సుఖ లాల సత్వంతో వచ్చిన అలసత్వ సిద్ధి.
అర్హతలేకున్నా పదవీ వ్యామోహం కష్టించకుండాధన లాభ దాహం.
తనకే అన్ని, తనకోసమే అందరి స్నేహం పాలసీ వ్యూహం
యావత్తు భూస్థలం కావాలె, తనకు కరత లామలక ఫలం.
స్వార్థం సకలం నేనే కావాలె నను కొంటున్నది.
బిందువు విడిగా ఉండి సింధువు కావలె నని కలలు గంటున్నది.
అదో! ఆబల్లిని చూడు. వలబన్ని చేస్తున్నది గూడు.
గూడు లోనికి వచ్చిన దోమ లీగల గుటుక్కు మంటుంది
గుప్ చుప్‌గా నక్కి యుంటుంది.
ఇదో! ఈ నల్లుల్ని చూడు ఇవే రక్త బంధువులు నేడు.
ఇవి నిశాచరులు, పళ్యతో హారులు.
పరుల నెత్తురులు నరుల నెత్తురులు
పరమాన్నంగా త్రాగుతున్న మత్త కరులు.
వీటి రూప మెంత సుకుమార మో! చేష్ట లంతటి ఘోరం.
అదేమిటి సింగిణీ వలె రంగులు మారుస్తూ పొంగిబుసకొడుతూ ఉంది.
చూస్తేనే భయం వేసే ఊర్ధ్వ వికారంతో కన్ను మంటోంది.

నాల్కసాచి నమ్మించి పొంచి నంజుకొంటున్నది కీటకాల.
నానా రంగులు పులుముకొని ఆడు తున్నది కపట నాటకాల,
పెంచు కుంటున్నది దేహాన్ని ఈముసలి దయ్యం.
చించు కొంటున్నది గొంతు నెంతో రూపు గొన్న యీ అసహ్యం.
నల్లులు, బల్లులు, ఊసర వెల్లులు,భయంకర ఖిల్లులు.
నల్లులు,కాలి బంట్లైనడకతో వచ్చి దాడి చేస్తున్నాయి.
వియత్తలం నుండి విమాన బలాల్లా దోమలు విపరీతంగా
వచ్చేస్తున్నాయి.
హెచ్చు స్థాయిలో పాడుతున్నవి రాగాలుకుచ్చేవి మాత్రం శూలాలు,
నల్లులూ దోమలూ ఒళ్ళంతా ముల్లాడించి చిల్లులు చేస్తున్నాయి.
కసి గట్టి కాటేస్తాయి, పసి బట్టి రక్తపానం చేస్తాయి.
కాటు కనబడుదు, రక్తం కంట బడదు
దోపి బయట బడడు, తృప్తిగా రక్తం త్రావి త్రేపులు తీస్తాడు.
నల్లులు నాశన మనే గోడల మీది అక్షరాల వ్రాతలు
చేత కాని వాండ్ల శాప నార్థాలై పడియున్న ప్రేతలు.
పొగలు పెట్టి పో దోలిన దోమలు వాటి ధ్యానాలు
పగలు పట్టి వచ్చి ద్విగుణితంగా కుట్టి పెట్టి తీస్తున్నవి ప్రాణాలు
బాబో రక్తంపీల్చే దోమలు భూస్వాములు
వాన్ని చూస్తేనే చలి జ్వరం పుట్టు కొస్తున్నది.
కాళ్ళు కదల లేని మోడులై కంపర మెక్కు తున్నయ్.
వెలుగుల అండతో పురుగులను వేధించే బల్లులు.
చీకటి దండలో నరులను చీల్చుకొని తినే నల్లులు
ప్రాణులను బట్టి హింసించే స్వార్థానికి కన్న తల్లులు.
మట్టి పొర చాటు చేసుకొని మ్రాను కొరికి తినే
స్వార్థం చెద పురువుల
యువతరం ఉక్కు కండలచేవ
చెంప పెట్టు జవాబు చెప్పి తీయిస్తుంది పరువుల.

# ఆకలిదే! ఆకలి.

పలువురు నడచే బాట కాని కంట కాన్విత మార్గం గుండా
ప్రగతి పథంలోని మార్గం తెలియ నీకుండా
చచ్చి భూతాలైన కాల రాక్షసుల పక్షాలకు
రెచ్చిపోయి మానవ రక్త దాహంగల హార్య క్షాలకు
నిలయ మైన ప్రళయ మైన ఈ నిర్జ నారణ్యం మీకు శరణ్యం.

నిశాటుల్లారా! నిషాదుల్లారా! విషాదాంత నాటకాలు
వ్రాస్తున్నారా?
సోదర రక్తమాంసాలతో స్వోదర పోషణం చేస్తున్నారా?
మానవ రూపంలో ఉండి పశుత్వానికి వశమై పోయినారా?
స్వార్థమనే బురద చందనం వాసన వేస్తున్న దన్న దున్నలారా?
ద్వేషం మోసంతో దేవతా స్థానం సంపాదించాలను కొంటూరా?
దొంగ తనాలతో దొరలు గావలెనని చూస్తుంటూరా?
విలపించే ఆర్తుల నినాదాలు వీణా నాదాలుగా వింటున్నారా?
కనిపించే రాక్షసత్వమే స్వర్గాధి పత్య మిస్తుందని భ్రమిస్తున్నారా?
మహా ఘనుణ్ణి నే ననే దురభిమాన మద్యం త్రాగి తూగు తున్నారా?
మానవత్వపు మహావివేక మే మంట గల్పినారా?
చీకటి వేకటిలో పుట్టి పెరిగిన మీ రాకాసి తత్వం చావకుండా.
దినకాంతుల జొరనీయకుండా ఘనమైన రక్షణగా
ఆకాశమెత్తు పెరిగిన అరణ్యాలను పెంచు కొన్నారా?
ముండ్ల పొదల కంచెల మొలవేసి నిలవేసు కున్నారా?
చీకటి మా కను పాపల చీ కాకు పరచి భయ పెడుతూ ఉన్నది.
బహు జాతుల వృక్షాలు, పలు జాతుల ముండ్ల పొదలు
కులాని కొక మహీజం ఇలవేసి మొల వేసి పెంచారా?
నానాత్వపు అరణ్యం పరదా వెనుక నరకాసుర నాటకం
ఆడుతున్నారా!
సత్యాహావంలో చస్తాడీ నరకాసురుడు కుటుంభరుడు.
సమత్వ జ్ఞాన యోగాగ్నితో సమూలం యీ అరణ్యాన్ని
కాల్చేయండి.
ఇండ్లుగా భ్రమింప జేసే ముండ్ల పొదల సమూలం కూల్చేయండి

పిండాండాలతో నిండిన యీ బ్రహ్మాండం ఒకే ఒకటి
నదుల అడ్డు గీతల సముద్రాల అఖాతాలు మొగు లెత్తు పర్వతాలు.
హద్దులు పెట్టలేవు, అడ్డు గోడలు గట్టలేవు
అవనీ భాండమును ముక్కలు చేయ లేవు.
భ్రాతా ప్రపంచ వృక్షం పచ్చ పచ్చగా ఉండాలె.
అనురాగం చిగురులు వేయాలె నవ్వులు పువ్వులు పూయాలె.
కొమ్మ కొమ్మకు కోటాను కోట్లు కృషి ఫలాలు వేయాలె.
నానా విధ కవికకుంతాలు తాన రాగాల సమైక్యతాగీతం పాడాలె.
కొమ్మలెన్ని కొత్తవి పుట్టినా అన్నిటికి ఒకే వృక్షమూలాలే.
లోతుగా త్రవ్వి చూస్తే నే తప్పలోపలి మూలాల ఏకత్వం
చూపులకందదు
మా, నవతా విచారంలో "మానవత" ఒకే జాతేనని తేలి పోయింది.
హాస రోషాల్లో ఆత్మీయ సుఖదుఃఖాలుగా
అవతరించే నవ్వుల సందడికి రోదన నినాదాలకు
భాషా భేదాలు అనువాదాలు ఉంటాయా?
భాషలకు భేదాలుంటే భావాలకు భేదాలుంటాయా?
అవసరాలకు అనుభూతులకు ఆవంతైనా భేదాల్లేవు
భాషా భేదాలతో కాకి మూకలు కోకిలల తరిమేసినా!
కోకిల, మొగం దాచుకొనియైనా జనం మెప్పుగా తనగానం
ఆలపిస్తుంది.
ఇక్కడ అందరూ అధికారులే అందరూ సమ పౌరులే,
అందరం కలిసి అందరికినై ఆకలి దప్పుల శత్రువుల నెదుర్కోవాలె
ఏమిటీ దరిద్రులు, ధనికులూ! ఎందుకీ విభేదాలు?
దారిద్ర్య గర్భంలో దాస్యం పుట్టి పెరుగుతున్నది.

ఆకలి గర్భంలో అనేక అపరాధాలు పుట్టి పెరుగుతున్నాయి.
పరిసరాల ప్రభావంతో బాగా పెరిగి పోతున్నాయి.
ఆశగర్భంలో కూడా అనేక దౌర్జన్యాలు పుట్టి పెరుగుతాయి.
ఇక్కడ ఆకలి గర్భంలోనే అనేక అపరాధాలు పుట్టాయి.
కరువు కాటకాలు ఎరువులు వేశాయి.
నిరుద్యోగ మారి నీళ్ళు పోసింది
ఆకలి గర్భంలోనే అనేక అపరాధాలు, ఆర్థిదైన్యాలు పుట్టాయి.
పరిసరాల ప్రభావంలో బాగా పెరిగినాయి.
ఆకలియే ఆకలి దారిద్ర్యమే దైన్యం కరువు.
చక్రం నాగలికేల గొని సహోదరులిద్దరు సాక్షాద్దేవతల్లా
సాందీపుని యింటి చదువులు సఫలంచేయండి.
రారండీ రామకృష్ణులై రైతు కూలీలు ముందుకు
ఆకలియే ఆ, కలి. అనుమానమెందుకు?

# ప్రకృతి ప్రేమమూర్తి

ప్రేమం, ఎంతమధురం దీని నామం, ఇది వేదాల్లోని సామం.
భూతల స్వర్గ ధామం
ఇది విడుపించుకోలేనిబంధం, బంధంలోగూడా అతురానందం
ఇది అమృతపువిందు, ఇది హింసాజిఘాంసా రోగాలకు మందు
ప్రేమతల్లి అది భూతకోటికి కల్పవల్లి, ఎంత త్రావినా ఒడువని
పాల వెల్లి.
రాగ కషాయిత రమ్యేక్షణాలు, ఈ ప్రేమకల్పలత పల్లవాలు

వదనారవింద సుందర మందహాసాలు దాని పూలు.
మమతా సమతలు ఆ పూలలోని మనోజ్ఞ సౌరభాలు
అంగాంగ, ఆలింగనములు దాని యల్లిబిల్లి యల్లికలు.
స్వార్థ రాహిత్యం దానియాలవాలం,శాంతి సహనాలు దానిమూలం.
త్యాగ భోగాలు దానిఫలాలు, సౌఖ్యసంతోషాలు దానిరసాలు.
"త్వమేవాహం సమావాప్తి" దాని మహాౌన్నత్యాలు.
ప్రతిఫల వాంఛా రాహిత్యం దాన్నిసాకే అమరఝురీ తరంగాలు.
భేద దృష్టి వైరముష్టి అనే కాల సర్పాలకు అది దివ్యౌషధి.
నానాత్వంలోని ఏకత్వం సిద్ధికి అదొక పెన్నిధి.
సమన్వయ దృష్టి దాని ప్రభావం, మానసిక విజయం దాని
శంఖారావం.
అఖిల ప్రకృతి తానొక ప్రేమమూర్తి, అద్వైతానంద స్ఫూర్తి.
ప్రేమ యొక దేవత, అది అఖిల భూత సేవిత.
విశ్వ విరాడ్రూపాలు దాని కనుపాపలు,అవి ప్రేమపయోధిలోని చేపలు.
ఈ సృష్టియంతా ప్రేమదేవతా విహరణ, దానిదేయూ కరుణ.
ఆ మంద మారుతాలు దానినిశ్వాసాలు,ఆ మేఘాలు దానివక్షోజాలు
ఆ వర్షాలు దాని వక్షోజాలు కురిసే చనుబాలు,
ఆ సూర్య చంద్రుల పవలు, రేయి ఆ యమ్మ కను దోయి.
ఈ భూగోళం ఆప్రేమదేవతా హృదయం అది సదా సదయం
ఆ యాకాశము ఆ యమ్మ గర్భకోశము, దాని శరీరాంగములు
కనుకనే
పృథివి కంతటి శాంతము, జలమున కంతటి దయారసస్వాంతము.
వాయువున కంతటి ప్రాణ ప్రదత్వము, అగ్ని కంతటి
ఆత్మప్రకాశ తత్వము.
గాఢాంధకార విచ్ఛేద సత్వము- ప్రేమక్షణికం కాదు నిత్యము.
అట్టి ప్రేమజనని కన్న బిడ్డ యీ మానవుడు.
ఆ ప్రేమరూపి మానవుడే మాధవుడు.

# తిర్యక్కు—లేనయం.

మానవుడు ప్రేమ మూర్తి కాని ఐనాడు స్వార్థి.
కుల విభేదాలు కదుర్చు కొన్నాడు, స్థల విభేదాలు
సవరించుకొన్నాడు.
మత విభేదాలు మొల్చాయి, మాటల విభేదాలు నిల్చాయి.
విభేదవృక్షం మీరూ, మేమూ అనే వేర్లతో
మహావృక్షంగా పాతుకపోయింది మారు పేర్లతో.

అదో అటుచూడు! ఒకానొక వింత పర్వం నేడు.
వర్ణాలు-వర్గాలు-జాతులు—నీతులు - మతాలు పథాలు.
సంప్రదాయాలు-ఆదాయాలు-కులాలు-బలాలు-
భేదాలు-వాదాలు-అడ్డురావు-అంతా ఒకే ప్రోవు.
రంగు రంగుల పావురాలు-రమ్యమైన పావురాలు.
అన్నీ ఒకే తావుల్రవాలు-కలసియాడు నాట్యాలు.
ముక్కూ ముక్కూ గీలిస్తూ, రెక్కా రెక్కా ఒరుస్తూ
పంజరాకృతులతో ఆడుకొంటూ ప్రదక్షిణాలతో పాడుకొంటూ
ఒకే క్షేత్రంలోని గింజలు, కలిసి మెలసి తింటున్నాయి.
ఒకే పాత్రలోని నీరు ఓపిగ్గా త్రాగుతున్నాయి.
వర్ణాల కక్షలు లేవు, కులాల కుళ్ళు లేదు, జాతుల జగడాలు లేవు.
నల్ల తెల్ల పావురాలు నవ్వుతూ జంటగూడి చరిస్తున్నాయి
తెల్లపీ నల్లపీ దివ్య ప్రేమలతో వరిస్తున్నాయి.
ఐక్యంతో అంతా ఒకే ఆనంద సముద్రంలో మునిగి తేలుతున్నాయి
ఎత్తూ వంపులు లేని, ఎలాంటి అడ్డు గోడలు లేని, అంబరాల అంతరాలలో
హాయిగా పంక్తులై అస్తంభ ఆకాశపు పందిరికి జగత్కళ్యాణార్థం
అసూత్రితంగా అనేకరంగు కాగితాలతోరణాలు కడుతూ
ఆకాశయానం చేస్తున్నవి, హాయిగా వల్లటీలు వేస్తున్నవి
కంటిలో నల్లతెల్ల వర్ణాలు కలసి యాడినట్లు
ఒకే యింటిలో జంటయై నల్ల తెల్ల పావురాలు యింపుగా
పింపిళ్ళాడుతున్నాయి
ఆకాశంలోని అన్ని వర్ణాలూ ఐక్యమై ఆనీల వర్ణాకృతి ధరించాయి
పావురాల ననుకరించాయి.
అత్యున్నత స్థానంలో కెళ్ళి అన్ని వర్ణాలు
అంతరించి ఒకే వర్ణంగా భాసించాయి.

అని. వాని నీలి నీడలు వ్రాస్తున్నవి అంతా ఒకే వర్ణాక్షరాలై
ఆకాశ సముద్రంలో ఈదే రెక్కలుండి పక్షులు
ముక్కులతోనే తినాలి, పశువులకు నాల్గుకాళ్ళున్నా
చేతులు పని చేయలే వనాల్ని

వానరులకు అవయవాలన్నీ ఉన్నా వాక్కులేనివన్నా!
మనిషికి అవయవాలన్నీ ఉన్నా మాటలిచ్చినా మతి యిచ్చినా
మంచితనం సున్న
మానవునికి మంచి తనం లేకుండుటే విస్మయం
వానికన్న తిర్యక్కులేనయం.

# మాయింటి పరిచయం.

సంతోష స్వాంతులమై అంతా ఎదిరి చూస్తున్నాం.
అరవై ఏండ్లకు తిరిగి ఆనందా! వచ్చావా?
అధికార భాష తెనుగనే ఆనందవార్త తెచ్చావా?
నీకు మా సుస్వాగతం, మాకీ ప్రొద్దు సుప్రభాతం.
ఆనందాశ్రులివే, నీయడుగు దోయి కడుక్కో,
అంతరంగ ప్రేమపీఠి నలంకరించుము తల్లీ!

రా అమ్మా! రా! మా యిల్లు చూద్దువు గాని,
నీకోసమే తపిస్తున్న మా యింటి ఆర్త హృదయాన్ని
జాగ్రత్తగా చూస్తూ అడుగు బెట్టాలి తల్లీ!
మా యింట్లో అన్నీ యెత్తు వంపులే, ముండ్లే,
ఈ యెత్తు వంపుల్లో కాలు విరగ బడి యింటికొచ్చిన
మా శాంతి చెల్లాయి కుంటుతూ నడుస్తున్నది.
మా అమ్మ ఈ అమ్మాయి బెంగతో మంచం బట్టింది.
మంచి డాక్టరు వద్దకు కొని పోయి మందు చేయిద్దా మంటే,
ఈమధ్య మందులు గూడ మందుల చేతుల్లో బడి
మంచి గుణాలు కోల్పోయి, మంచి నీళ్ళకంటే పలుచ నైనాయి.
మెల్లగారా! తల్లీ! క్రింద జూస్తూ, చల్లగా ఉండాలి బ్రతు కెపుడు
యిల్లంతా సిమెంటు జేయిస్తామని, యిరవై బస్తాలు దెప్పిస్తే
పనికి రాకుండా పోయి పైసంతా బూడి దయింది.
ఏంజెప్పాలి తల్లీ! ఏమంటే ఏంలాభం?
ఈ కన్నామాదే వేలూ మాదే అని యేడ్చి ఊరుకోనాల్సి వచ్చింది.
మా యింట్లో వేద మంతా తలిక్రిందులు చదువుతున్నారు.
పైకి పరమార్థం అంతరంగంలో పచ్చి స్వార్థం, అంద రందరే
అయి పోయారు.

మా పెద్దవాణికి పని చేతకాదు, చిన్నవాణికి చదువురాదు.
నడిమి వాణ్ణి నేను చదువుకోని ఉద్యోగం దొరక్క
పనిచేస్తే మనిషిలా బ్రదికేంత ఫలితం దొరక్కా
ఉట్టి కందకా స్వర్గాని కందకా ఉభయభ్రష్టుణ్ణై పోయాను తల్లీ!
అసలు మాపెద్ద వాణికి బుద్ధుండొద్దు,
తమ్ము డేడుస్తాడు తలా యింత దిందాంరా! అంటే
చిన్నవాని కడుపు గొట్టి

ఉన్నదంతా తానే తిని
చిన్న గాదెలా పొట్ట పెంచాడు.
నానాటికీ వాడొక మానులా తయారైనాడు.
అంత కంతకు వీడొక ఎముకల బోనులా మిగిలాడు.
నేను పెద్ద వాణ్ణని ఇంట్లో దొరతనం చేలాయిస్తాడు వాడు.
బానిసలా ఆజ్ఞలను పాలిస్తూ అడ్డమైన చాకిరీ చేసి పోయాలె వీడు
ఒక వైపు ఇలా శ్రమనంతా మేస్తూ మేధస్సు కండలు పెంచితే
గుండె కరిగి కుండెడు నీళ్ళు కన్నులనుండి కరుణ రస వర్షం
కురుస్తున్నది.
ఏం! అలా ముక్కుమూసు కుంటున్నావు.
ఇల్లంతా కుళ్ళు కంపు కొడుతుందా?
జగిలివేసి సమం చేసి ఇల్లంతా అలికి పూసి, దరిద్రపుకంపును తరలించి
నాకలోకం చేస్తానని నడుం కట్టింది. మా అక్కయ్య!
కొంపేమొ కొట్ట మంతాయె. కంపేమో కావలసి నంతాయె.
ఆడ పిల్లాయె, చేతగాంది, అని అనుకోవద్దు సుమా!
ఇరవై విధాల ఇదంతా సకల జన సుఖీభవ యనే స్వర్గ తుల్యం చేస్తుంది.
మా చిన్ని పాపాయిని చూపుదామంటే
మాగన్ను బెట్టి నిదుర పోతోంది.
అన్నమన్నమని ఆకలికి యేడ్చి యేడ్చి ఉడుకుతున్నదే అంటే
ఉండి ఉండి కూర్కింది.
నిదుర లేపి నెమ్మదిగా తినిపించలేక పోయావా, అంటావా?
అత్తైస రిడిన కుండలో ఉత్తనీళ్ళైనాయె ఉడికేవి.
కన్నపిల్లలను గూడా మోసగించే కసాయి వాళ్ళమైపోతిమి.
తలచుకుంటే తల్లడిల్లి పోతోంది గుండె.
కన్నబిడ్డ ఆకలిని చూడలేని గతి మాలింది పాపం.

ఆ కన్నె పిల్లను చూడు, అన్నవస్త్రాల కని ఉన్నవాని దరికి పోతే
ఉన్న వస్త్రమే ఊడ గొట్టుకొని ఊరగుక్కలా చూడబడుతోంది.
మిన్నాగు వలె మీదబడి బరికి పెట్టే దారిద్ర్య కాల సర్ప విషాప్తి
విస్మృతయై వివేకానికే విడాకు లిచ్చింది వెట్టి తల్లి!
కన్నె అంటివి, కన్నబిడ్డ యీమెకెక్కడిదని అంటావా?
కాసుల ఆశకు ప్రేమను వేలం వేసి వేలు లక్షలు గడించే
పరమ లోభులైన పురప వేశ్యలకు బుద్ధిచెప్పే శక్తి కొరవడింది.
చేసేదిలేక చెడిపోయినానని చెప్పుకుంటున్నది ఏడుస్తూ!
అన్నమో రామచంద్రా! అంటే అరణ్యంలో
ఆకులలాలు తింటున్నా నంటున్నాడు.
బట్టో బలభద్రా! అంటే, నావస్త్రమే నల్లగా మాసి
నానా అసహ్యంగా ఉందంటున్నాడు.
రాగానే ఇదేమి రభస, అని విసుక్కోకు దయచేసి
ఆదరించే తల్లి వని ఆవేదన వెళ్ళబోసుకున్నాను.
రోగి దగ్గఱకు వస్తే రాగం పాడి వినిపిస్తాడా?
ఏమిటీ భారత మంటావా? మరి ఇదే ఈనాటి మాభారతం.
అభ్యుదయ ఫలం అద్దంలో చంద్రోదయం వలె
అడుగు దూరంలోనే ఉండి అందకుండా ఉంది.
ప్రగతి వృక్షం మొల వేశాం ప్రణాళికల నీళ్ళు పోశాం
కాని ఫలించే వేళకే వేరు దగ్గర నీరు చెదలుతాకి మాడ్చివేస్తుంది.
ఎండ్రిన్ వేసినా ఏమి చిత్రమో కాని విషక్రిమి న్యాయంగా
మొసవి బలుస్తున్నవి
మరచాను నీ కర కప్పు కాఫీ ఇస్తామని అనుకుంటే
చక్కెర రవ్వలు చుక్కలై ఆకాశంలో ఆడుకొంటున్నాయి.

పాలంటే పాలే పాలు,నీళ్ళు బోయ వలసిన పనే లేదు.
సరుకుల ధరవరలు ధర మీదనే లేవు.
ప్రతి పదార్థం సంకరావతారం దాల్చి ప్రత్యక్షమైతుంటే
తలవంచి దండం బెట్టక తప్పుతుందా?
పోనీ పెద్ద ముత్తైదువవు చిన్న రవికబట్టైనా చేతి కిద్దా మనుకుంటేనా?
అంబరాలు అంబరాల్లో తెగిన గాలి పటాల్లా తెగ ఆడుతున్నాయి
ఒకటేమిటి?
మొత్తం వస్తువుల ధరలు నెత్తికెక్కించుకున్న భార్యామణిలా
బిఱ్ఱ బిగిసి బెత్తెడు సళ్ళు చూపకుండా స్వరాజ్యం సాగిస్తున్నాయి.
ఇంకమీద ఆ గుళ్ళో దేవుని కైనా ఆంగట్లో ఉన్న ఆబెల్లాన్నే
ఆరగింపు జూప వలసి వస్తుందంటున్నాడు అర్చకుడు
ఎక్కిన ఈ తేలు విషాన్ని దింపలేక పోతున్నది మంత్రకాళ్ళ మంత్రశక్తి
కన్నవారందరికి అన్న వస్త్రాలు సమంగా పంచి సవరించాలని
కంట్రోల్ కన్యను, కల్యాణం చేస్తున్నది పెత్తనం,
పెద్ద మనిషి కళ్ళల్లో అద్దసేరు దుమ్ము గొట్టి
ఆమె చాటుకు సావుకారితో ప్రేమనాటకం సాగించింది.
చీకటి బజారు చిన్నది అవతరించింది.
దాని మొగం చూస్తే లక్ష్మి! తాండవం చేస్తుంది చూచిన వారికి
చంపాలంటే చే యాడుతుందెవరకి?
చీకట్లో పుట్టి పెరుగుతూ ఎండకన్నెరుగని దని సుకుమారి అన్నాము
పురోహితు ణ్ణడిగితే ఈ బిడ్డ జన్మ నామం గోమారి అని తేలింది.
నిశాచర గణమైనా వర దక్షిణ బాగా తెస్తూవలపించే పిల్లను
వద్దంటారెవరు?
ఈ అవమానానికి అశోక వృక్షంక్రింద సశోకయైంది మాత

ఈ మాయా సముద్రాన్నిదాటి యెవడు రావాలె దూత
ఆంధ్రుల పాలిటి కల్పతరువు అఖండ శక్తి సంపన్నుడు
మంగపతి వేంగడనాథుని కరుణతో మా యమ్మ
మంచి దినాలు చూస్తుంది
అన్నపూర్ణయై చేయి విడిచి వడ్డిస్తుంది
మా చెల్లాయి వచ్చి భోజనానికి బొట్టు చెప్పుతుంది
నిరీక్షిస్తూ నిలబడు తల్లీ! అంతవరకూ !!

# వెనక్కు పోకండి.

వెనక్కు చూడకు, పద పద ముందుకు; ఎందుకు?
వెనక్కు చూస్తే భూతం, భయంకరంగా కాన వస్తున్నదందుకు.
భూతం మనల్ని ఏమంటున్నది? ఎందుకు రంధి?
మరణం, దారిద్ర్యం, అనే అగ్నినేత్రాలతో వర్తమాన
వర్ధమాన ప్రగతిని మింగి పెడతానంటున్నది.
ఆ రెండు కన్నుల్లో దారిద్ర్యం కన్న మరణమే
కారుణ్యం గలదని పిస్తున్నది

మరణంలో బాధ క్షణం వెనుకటి బాధలన్నీ శివార్పణం.
కాని దారిద్ర్యపు చెద కరిన పాషాణం
అది బ్రతికుండగానే అనుక్షణం చంపే మరణం.
ఎట్లువచ్చింది దారిద్ర్యం ఎవ్వరిదీ సారథ్యం,దీనికి లేదామందూ పథ్యం?
ధనిక వర్గం మన నిమిత్తం తినమని యిచ్చిన దారిబత్తెం
బ్రతికి యుండే దయ్యమైనాడు బ్లాక్ మార్కెటింగ్ సేట్
చచ్చే అంత ద్రవ్యం సంపాదించింది ఆతని ఉపయోగించే ఘూాట్
ఎంత? చస్తే అతణ్ణి కట్టెల్లో గాక నోట్లకట్టల్లో తగిలేసే అంత.
అతణ్ణి ప్రశ్నిస్తే ఎలా సంపాదించా నంటాడో తెలుసా!
ఎలా? మీరేమో రూక రూకకు చేమటోడ్చి పడాలె కష్టం
నాకేమో కూర్చున్న చోటికే కోట్లు తెస్తుంది అదృష్టం
అని నుదుట కేలూని చూపిస్తాడు స్పష్టం
తలలో ఏముంది? తలలో మోసపు వలఉంది,
దానితో మన ధన లక్ష్మిని బట్టివేశాడు
ఆ వల దృష్టమయ్యేది కాదు. అందుకే అది అదృష్టం
అందుకే అతని చోరు డనం. కుబేరు డంటాం
ఆ సేటు వద్ద కూర్చున్న అత డెవరు? చాటునుండిచేయి చాపుతున్నాడు
అతడొక లంచగొండి, అతడు ప్రభుత్వ యశోభీష్ముని పాలిటి
మొండి శిఖండి
కాలుకు పుట్టి మాననిమండి,అయితే ప్రగతిని రోధకుల్లో పీ డొక డనండి.
అతని ఈ చర్య పైవారికి తెలిస్తే దోషి, తెలియకుంటే మహా మనీషి,
అత్యున్నత కుటుంబ పోషి, ఆత్మ సంతోషి, సత్యద్వేషి
వీరంతా ఇంటి దొంగలు, తెల్ల బట్టలో నున్న కొంగలు.
పైకే స్నానాలూ ధ్యానాలు వీరి దృష్టికి గురి ఐతుంటాయి మీనాలు.
వనవాసి, ఋషివేషి,సత్యభాషి,రైతురాముడు తనువు ధనువు గావించి
కరాల శరాలుగా ఎక్కుపెట్టిబడలు విరిచి గడించిన సీతా మహాలక్ష్మిని
హరించే నిశాటులు దశాస్యుల ఇరవై బాహులు బంధించడానికి
ఇరవై సూత్రా లుపయోగించండి,ఎపుడూ వెనక్కు పోకండి,

# సంఘం శరణం గచ్ఛామి.

దుఃఖాల్లో దూరంగా ఉండక సంఘం సరసలో ఉండి
ఆదరిస్తే స్వాంత వేదన సగం పోయిం దన్నావు
సుఖాలలో సంఘం నిను చూడ వస్తే
సుఖపు సంతోషం ద్విగుణిత మైం దన్నావు.
సంఘానికి దూరం జాంగల ప్రాంతంలో నీవుంటేః
అండమాన్ జైలుకన్నా అధిక కష్టతర మన్నావు.

సంఘంలో నిర్భయంగా నున్న నీవు సంఘంతో చాల
మేలు పొందావు,

సంఘాన్ని స్వార్థానికి చాలా వాడుకొన్నావు
సంఘానికి ఋణపడి యున్నావు.

స్వార్థం తీరితే చరణాన తన్నావు సంఘానికే ద్రోహం చేస్తున్నావు.
అమ్మపాలు గుడిచి రొమ్ము గ్రుద్ది పోయే బేమాన్
మోసంతో సమాజాన్ని దోచి దేశద్రోహివైన శ్రీమాన్,
ఇప్పటికైనా కన్నువిప్పు, తెలిసికో నీతప్పు.
సంఘం శరణం గచ్ఛామి। అను-సంఘద్రోహ చర్యలు
చేయకుండుటే ధర్మం విను.

ఒక దారం ఎంత గట్టిదైనా వస్త్రం కాబోదు,
ఒక మనిషి ఎంత సమర్థుడైనా దేశం కాబోడు,
నిష్కామ కర్మ అంటే సంఘసేవ,
ఎన్నిమతాలు ఉపదేశించినా అదే త్రోవ,
కర్మయోగి కానివాడు గడియైనా బ్రదుకలేడు,
తన చుట్టు చుట్టి వస్తూ సూర్యుని చుట్టు చుట్టి వచ్చే భూగోళంలా
స్వార్థం చూచుకొంటూనే పరార్థం పరమార్థ మని సేవించు.
నీజన్మ ధన్యం గావించు, దేశమును ప్రేమించు.
అంధ విశ్వాసాల తమాన్ని తలక్రిందులు గావించేదే మతం.
నానాత్వాన్ని ఏకం చేసే బలమే నిజమైన కులం.
ఆడ, మగ, శరీరంలోని, ఆవైపు, ఈపైపు అనే
అర్ధ నారీశ్వరుని ఖ్యాతి మన సంస్కృతి జాతి
సంఘం నాల్గు ముఖాలుగల బ్రహ్మ పది రూపాల ప్రకాశించే విష్ణువు.
సంఘం, ఆడ, మగ రూపుగొన్న ఆది శంకరుడు.
సంఘం విశ్వ విరాడ్రూపి-
సంఘం శరణం గచ్ఛామి,

# చచ్చి పగ సాధించింది.

ముండ్లు-ముండ్లు-ముండ్లు-తేలుకొండ్లు - పాముపండ్లు-, ముండ్లు
ముట్ట నీయవు. పట్ట నీయవు-ముందు పాదం పెట్ట నీయవు,
కొన్ని స్థిరాలు, కొన్ని చరాలు, కర్కశ రూపాలు-విషయుక్తాలు
ఇవి ప్రగతిని కుంటు పరచేవి-అవి ప్రాణమే తీసేవి
అటు చూడు నరక ముఖ ద్వారం, ఘోర హింసాకారం
అది నోరు తెరచింది-నిప్పుల కుంపటి పరచింది.

క్రకచ ధారలు ఆ కోరలు ఆకురాయి పోలిక ఆ నాలుక
లేలిహ్యామాన జ్వాలయై వ్రేలుతున్నది దాని నాలుక.
అది బెబ్బులి-మహాబలి-ఘోరకలి-ప్రాణులన్ని దానికిబలి,
దాన్ని చూస్తేనే అమాయక ప్రాణులు హాలాచలి.
గోవును కొరికింది-లేడిని కఱచింది-మేకను పంజాతో చరచింది.
దౌర్జన్యానికి వెనుకనే దాని మృత్యువు పరువెత్తుకొని వస్తుంది.
పాపం దానికి వెనుక చూపులేదు- కనికరం అంతకూలేదు.
రంగుల డ్రస్సును వేసుకొని రాజువేషంవేసి విహరిస్తున్నది.
చచ్చిన గోవు చర్మంలో పచ్చని గరిక నింపారు ఎచ్చుటి కచ్చుట కుట్టారు.
అచ్చం ప్రాణమున్న గోవులా అబోనులో నిలిపారు.
దాని దినడానికి బోనులోకి వచ్చింది, పులి చచ్చింది బలియైంది,
తాను చచ్చి పగ సాధించింది గోవు, దౌర్జన్యానికి సత్ఫలితా లుండబోవు.
ముండ్లు-ముండ్లు-పల్లేరులు-పచ్చి రేగు ముండ్లు-కుచ్చు తుమ్మ ముండ్లు.
చర్మంలోకి చొచ్చి విరిగి చక్కని ప్రగతిని కుంటు బడేస్తున్నవి.
మెత్తని చర్మం ఏం చేస్తుంది- కాలెత్తకుండా చచ్చిపడి ఉండాల్సిందే.
చచ్చి పగ సాధించింది చర్మం -చెప్పులుగా తయారైంది చర్మం.
కంటకాల ముఖాలు విరిచింది-వాడి వీడి పడి పోయాయి చూడు
మేము ముండ్లం, ప్రగతి బాటలన్ని కప్పి వేశాం వ్యాపించి.
మాదే ఈ అవని యంత అని చెప్పకుండా చెప్పాం.
మూడు మూళ్ళ చచ్చు చర్మం, ఏడ కని వ్యాపిస్తుంది,
మాపై దాడి చేస్తుందా?
తనె డంతనే ఉన్న చర్మం, ప్రగతి గాముల చరణా లంటి పెట్టుకొని
విశ్వ వ్యాప్తి గాంచింది, కంటకాల నేల రాచింది.
చచ్చి పగ సాధించింది చర్మం.

# నవత రావాలె.

సత్రంలో నీవు వచ్చి చాలా రోజులైంది
యాత్రికుడా వెడలి పొమ్మా ఆవలి వారికి తావిమ్మా
నీకు నాల్గు రోజులే నివాసాని కర్హతవుంది.
ఆ తరువాయి వద్దన్నా, అరుగ వల్సె వస్తుంది.
నవత ప్రకృతి స్వభావమ్మా, దాని నాపుట కెవరి కున్నది దమ్మా?
కొత్త నీరు వస్తున్నది నదుల్లోకి పాత నీరు పారి పోతున్నది సముద్రాల్లోకి
కొత్త ఆకులు చివురిస్తున్నవి-పాతవి విడాకు లిస్తున్నవి.

ప్రకృతిలో ఋతు గణాల మార్పు-కాలం యిచ్చిన న్యాయమైన తీర్పు
మార్పు ప్రగతి పిల్చుకొనే ఊర్పు అదే వద్దంటే
అవని నుండే బస మార్పు

కొత్త-ఉచ్ఛ్వాసమై లోనికి పోవాలె-అదేమన ప్రాణంకావాలె.
పాత నిశ్వాసమై వెలికి వెడలి రావాలె-బ్రదుకు సాఫీగా సాగి పోవాలె.
పాత యిల్లు పడగొట్టాలె కొత్త యిల్లు కట్టాలె.
లేకున్న ఉన్నవారికే ప్రమాదం. తుదికి మిగిలేది నిర్వేదం.
నిన్న నేడు లేదు, నేడు రేపు ఉండబోదు, కాలాశ్వం వెనుకకురాదు.
నిన్నటి లోపాలు దిద్దుకొని నేడు నేటి లోపాలు సద్దుకొని
రేపు అనుభవం గడిస్తుంది.

అభ్యుదయ పథంలోని మైలు రాళ్ళు, అహర్నిశలు అధిగమిస్తు
ప్రగతి గమ్యం చేరడానికి పరువెత్తుచే బ్రతుకు.
పాతయే పకడ్బందిగా ఉండాలా?
మరి తండ్రి కొడుకు నెందుకు కనాలె?
ప్రకృతి, పాతదే మారి, కొత్తదై తుంది.
కొత్త, ప్రాచీ దిశలోని ఉదయం అదే అభ్యుదయం.
పాత, ప్రతీచీ దిశలోని సాయం, అది అంతరించడం ఖాయం.
పాత పూలు పరిమళం వీడాయి,వాడాయి,
కొత్త పూలకై నిరీక్షణం ప్రతిక్షణం
యువత ఇప్పుడే ఉదయించిన సవిత, యువతయే నవత.
దానినే వలచి పాడుతుంది, కొనియాడుతుంది నాకవిత.
చీకటి పోవాలె దానికి సవితయే రావాలె.
నవత కావాలె దానికై యువతయే రావాలె.

# గాలివాన.

ఎక్కడి నుండొచ్చిందీ గాలివాన, ఇది ప్రపంచాన్నే ముంచే తుఫానా?
ఎదురుగాలి దుమారం, ఎవరాగుతారు దీని ముందు.
బెదరి వెన్నుజూపి వెడలి పోతున్నారు మంది.
పిడుగు గర్జలతో గుండె లడలి పోతున్నాయి.
మెఱుపు తీగలు కండ్లల్లో చీకట్లు పరపుతున్నాయి.
కొండలు కూలి పైబడేలా గుమి గూడినై కారు మొగుళ్ళు.
బండల శరవర్షం ఈడ్చీడ్చి కొడుతున్నాయి వడగళ్ళు.

ఫెళ ఫెళార్భటులతో వ్రేళ్ళు పెల్లగిలుతున్నాయి.
ఆకాశ మెత్తు వృక్షాలు, అవనీతలంపై శయనించాయి.
దొరల ఛత్రాలు విరిగి వెనుకకు మొగుడ్చుకొని పోయాయి.
ఎక్కడి నుండొచ్చింది గాలివాన, ఎలావచ్చింది తుఫాను?
రైతు కన్నుల నుండి రాలే బాష్పాలు, కూలీల నిట్టూర్పు
గాలి దొంతరలు.

మనసు మండిన బీదవాని రుషాగ్ని ఆకటికై యేడ్చే
ఆగతి మాలిన వాని రొద.

కష్ట జీవుల కలత మనసులు కలిసి మెలిసి ఎదురు నిలిచి
మబ్బులై మాయలై ఉరుములై మెరుములై విరుచుక పడి.
గాలి వానలై గర్జించి వర్షించి వాహినులై వస్తున్నవి.
ఈ ప్రవాహంలో ఈ గాలి సుళ్ళల్లో కొంపలాగవు.
ఛత్రాధిపతులారా! జాగ్రత్త! ధనవంతులారా!
మును వెనుక లాలోచించండి.

మీ, సువర్ణాలలో ఎన్నివర్ణాల జొన్న యన్నం దాగియున్నదో?
మీ, వెండిలో ఎండుప్రాణుల యెన్ని మెతుకులు గుప్తగతి
కరడు గట్టాయో?
మీ, కెంపుల్లో రవ్వల్లో ఎన్ని బక్కప్రాణుల రక్తాలు, ఎముకలు
చిక్కుకొని పోయాయో?
మీ, ఒకొక్కొక్క రూపాయ నిరుపేద యొక్క ఒక్క రూపాయ నని
సాక్ష్యం చెపుతున్నది.
లోహాలకు విలువ నిచ్చి దేహాలను చంపుతారా?
రాళ్ళ కోసం కూ ళ్ళెత్తగొడతారా?
ఆ గాలి వాన జూడండి, ఇక ఆగలేవు మీ యిండ్లు
ఆకాశంలో కెగిరి పోతాయి.

ఇండ్లు కొట్టుకొని పోకుండా మట్టిగా బంగారాన్ని
రాళ్ళుగా రత్నాలని
బరువులు పెట్టు కుంటున్నారా! ప్రయోజనం శూన్యం
ప్రళయంలా శివమెత్తి వచ్చు తుఫానులకు పడిపోకతప్పవు.
లోహాలకు విలువ నిచ్చి, దేహాలను చంపకండి.
ఓర్పులు విడిచే ఊర్పులు మార్పులు చెంది,
ప్రళయ ఝంఝా మారుతాలై పరమ శివుని తాండవాలై,
మహా స్వార్థ పిశాచాలైన బకాసురుల నోళ్ళల్లో
రావణా సురుల కళ్ళల్లో కుంభకర్ణుల కూళ్ళల్లో
మట్టి గొట్టి దుమ్ము జిమ్మి, అట్టహాసంతో వస్తున్నవి
సోదర రక్తాల సుఖ మద్య పానాల కైపులో
చెల్లెండ్ర మానభంగ ఆనందాల మైమరుపులో
తన గోరి తానే తవ్వుకొన్నది స్వార్థం.
చెంత నుండి చూస్తూగూడా చేయూత నిచ్చేవాడు లేడు.
సమాజ సానుభూతి కోలుపోయింది
సహకారం పోగొట్టు కున్నది.
ఇకెట్లా అని ఆందోళన పడుతూ తలపట్లు పట్టుకొన్నది.
పడిపించు కొన్న కన్నీళ్ళు యేరులై ఉప్పొంగి పొరలినాయి
ఆ ధాటికి తవ్వుకొన్న తమ బొందలు ఉరలినాయి
బొందలు పూడాయి, స్వార్థం తన సమాధి తానే కట్టుకొంది పాపం.

# స్వార్థం బలిసి సమాధి కట్టింది.

స్వార్థం సకల బ్రహ్మాండాల అండాలవలె అలభ్యంగ మ్రింగే అజగరం.
అది ఆహారానికి నోరును మాత్రమే తెరిచే సోమరి భూచరం.
నవ్వుల వెల్గుల నీడల్లో నానా రాకాశి బల్లులు
స్వార్థం నమ్ముకొని వచ్చిన కీటకాల
నాల్కకు రాచుకొని త్రేచే వేట, వాని కదొకలీల.
వేశ్యల వలపులు- ఆషాడభూతి తలపులు.
గడ్డి గప్పిన బావి దానిలో బడని పశువులేవి?

చెప్పే మాటలు వేరు, చేసే చేష్టలు వేరు, ఏనుగు దంతాల తీరు.
శకుని మాయ జూదం, భేద నీతి వాదం,అదే దాని వేదం.
రామ రూప రావణ విలాసం-కష్టపడకుండా కాజేయాలె గ్రాసం.
ఆకాశ మంత పొట్ట-ఆవులిస్తే పేగులు లెక్క బెట్టె అతి దిట్ట.
గజ స్నానాలు - బక ధ్యానాలు-ఇవి దాని పూజా విధానాలు.
నాల్కపై తేనెపెరలు – నాభిలో దాగిన కత్తుల ఒరలు.
ఎత్తుల జిత్తుల నక్కలు - ఎరను ఆస జూపి
ఏర్పకుండా షికారు చేసే మత్స్య భుక్కులు.
అఖిల ప్రపంచం నాకే అనే మోహం-అవసర పూర్తి స్నేహం.
తీరని ఆశా దాహం, అద నెరిగి వేషాలు మార్చే దేహం.
అనారతం స్వామి ద్రోహం.
కయ్యాల కంప, కపటాల కొంప,కల్లల గంప. కృతఘ్నతల దుంప.
పైకి జూడు దేవు డదో అని ఆకాశం జూపి, భక్తిని రేపి
ఏర్పడకుండా ప్రక్క జేబు కొట్టేశే మహాపాపి.
శ్రీరంగ నీతుల పరదాలు చిల్లులు వడి యీ నాడు
ధర్మరాజు పేర చలామణి ఆయే యమ ధర్మరాజు బయట బడినాడు.
ఆరని ఆకలి తీరని దాహం గల స్వార్థ రాక్షసత్వానికి ఈ యాలె మరణం.
సమ సమాజ సంఘటిత సమైక్యత ఒకటే దానికి శరణం.
అనేకత్వం విభేదాలు, చీలికలు, అనే అమోఘ ఘాస్త్రాలు
పూని ఆజికొచ్చింది స్వార్థం.
మడత పెట్టి నంత మాత్రంలో బట్ట భాగింప బడలేదు,
రంగుల వైవిధ్యంలో వస్త్రం వేరు వేరుగా విభజింపబడ బోదు
గళ్ళు బట్టను కత్తిరించిన గుర్తులు కాజాలవు.
భాషా భేదం ఊత చేసి మతం పూత పూసికొన్న స్వార్థం.
మానవతను విభజింప బూనుటలు వ్యర్థం.

# అపశ్రుతుల సవరణ.

అపశ్రుతులు వినబడుతున్నాయి ఆపెయ్యండి పాట.
అసురులు కాని మానవు లంతా అంటున్నారీ మాట.
విపంచి శ్రుతిచేసి విలక్షణంగా పాడండి
పారిషదు లంతా మీ పాటకు పర మానందంతో లయవేస్తారు కనండి.
తంత్రు లన్నీ స్వతంత్రులైస్వరా లన్నీ.వికస్వరాలై
నవ రాగం ఆలపించాలె మానవ హృదయం నర్తించాలె.

విరోధ స్వరాల విసర్జించండి. అనుకూల స్వరాల ఆలపించండి.
అపుడే అదిరాగమై ఆనంద దాయకమౌతుంది.
వర్ణం పాడుతున్నారా! కర్ణ కఠోరంగా ఉందేమి?
వర్ణంలోని పూర్వాచరణం, అది మన జాతికే మరణం.
రాగంకాక అది ద్వేషంగామారి పోయిందే!
అంటరాని తనం ఏమిటి నీచ వర్తనం?ఇది భయంకర భూత నర్తనం.
అంటరాని తనం -అదొక కంటకాల వనం - ఆది ప్రగతినే
కుంటుపరేస్తున్నది.
అంటరాని తనం - అదొక అగ్నిహోత్ర ప్రజ్వలనం. అది మన జాతినే
కాల్చేస్తున్నది.
అన్ని జంతువుల దయతో చూచే,అన్నిహృదయాల్లోఈశ్వరుణ్ణే చూచే,
మానవునిదేనా ఈ మాట, మనం పాడ వలసిందేనా ఈ పాట!
బుద్ధుడు పుట్టిన పుణ్యక్షేత్రం, మహాత్ము డవతరించిన మహా తీర్థం
వారి సమతాప్రబోధాలకు మనం కల్పించినాము అపార్థం.
అంటరానిది కులమా! అదిపెట్టుకున్న పేరువలె చెబితేనే తెలిసేదే!
చెపితేనే తెలిసే కులానికి చెప్పరానంత ఇంత బలమా!
మానవత చెప్పకుండా తెలిసే నిజమైన సహజమైన కులం
అనేక కులాల కల్పన యాదవ వంశంలోని ముసలం.
అన్య కాంత అంటరాని దంటారే అన్య ధనం అంటరానిదని వింటామే
తన కష్ట ఫలితం తాను పూర్తిగా తినలేనివాడు.
తన భార్య మాన రక్షణం చేసికొనలేని వాడు అంటరానివాడు
ఏ శిల ఐనా చెక్కితే చెన్నకేశవుడు చెక్కకుంటే తొక్కుడు బండ.
వర్ణపూర్వాచరణం దీపాట ఐతే దీని పశ్చిమ చరణందే ఇలాంటిదో
మరో మాట.

తెల్ల వర్ణం దేవతంటున్నారు నల్ల వర్ణం నరుడే కాదంటున్నారు.
పశువు కంటే పరమ హేయంగా చూస్తున్నారు.
తల్లి పాలు త్రాగుతూ నల్లమచ్చ ఉందని పళ్లతో కొరికే పాపి
నీవు మానవుడవే కావు.
పాలు పరిత్యజించి పచ్చిరక్తం త్రావే రాక్షసుడవు నీవు
వెలుగు నీడలై విడలేని జోడులై తోడులై తెల్ల నల్ల వర్ణాలు.
ధరిత్రిపై నాట్యం జేస్తూ తమితో, కలిసి మెలిసి ఉన్నాయి.
ఆర్థిక సాంఘిక వైజ్ఞానిక సంస్కరణ ప్రతి వ్యక్తికి తెస్తుంది ఆదరణ
చేసికో నీ జాతి మతాల కీ సవరణ.

# అర్థంలేనిది వ్యర్థం.

అర్థం లేని బ్రదుకు వ్యర్థ మంటున్నారా,
అర్థం పరమార్థమై కూర్చున్నది వింటున్నారా,
అర్థ మున్నవాడు ఒక బలిసిన బ్రమాను
అర్థం లేనివాడు తా నొక ఎముకల బోను!
ఏమిటీ ధనిక దరిద్ర వివాదం ఎందుకీ పర్వత పర మాణు విభేదం.
ధనికులు దక్ష ప్రజాపతులై భిక్షుల నవమానిస్తారు
భిక్షులు క్రుద్ధులై రుద్రులై వీరభద్రులై దక్షుల తలలకే

ప్రమాదం తెస్తారు.

ఏమిటీ ధనిక దరిద్ర సృష్టివాదం ఏమిటీ పర్వత పరమాణు విభేదం.
దారిద్ర్య నివారణకు ముందు చూపు అత్యవసరం
వెనక్కు చూశావా మహా భీకర భూత దర్శనం.
మరణం దారిద్ర్యం కంటే కరుణం-అది క్షణం అది చేస్తుంది
తక్కు బాధల శివార్పణం.
దారిద్ర్యం జీవిత మంతా మరణ బాధే. అది కష్టసాధ్యమైన వ్యాధే.
చెమట బెట్టి శ్రమ జేయుటే దానికి తగిన మందు.
ఆ శ్రమ జలాలే దారిద్ర్యాగ్నిని చల్లార్పె వెందు?
శ్రమ జలాల మునిగి తేలే కర కమలాల్లోనే ఆ బలాల్లోనే
లక్ష్మి నివాసం చేస్తుంది చూడు అదే దానిస్థిర మైన గూడు
ముగ్గురిని పిలిచాం భోజనాని కని ముప్పైమంది వచ్చారుతినడాని కని.
నీళ్ళు బోసి పల్చనగా జేయి పప్పు లేకుంటే చేయు వలసి వస్తుంది అప్పు.
అందుకనే భోజనాని కని బొట్టు చెప్పిన ముగ్గురే రండి.
అధిక సంఖ్యలో వస్తే అసలు కూర్చోవడానికి స్థలం చాలదు చూడండి.
ముఖ మండలంలో సుఖ చంద్రులు నవ్వుతూ ఉండాలి
కరకమలాల్లో లక్ష్మి నాట్యం చేస్తూ ఉండాలి.
శ్రమ జలాల్తో ఈ మాగ్ని చల్లార్పివేయాలె
నిరుద్యోగ మారి సింహాసనం క్రిందికి నీళ్ళు తేవాలె.

# స్వార్థం అధికారి యైనది.

అదో స్వార్థం -అధికారి యైంది చూడండి,
అధికార మధుపాన మత్తతలో
అదో అపరిమిత స్వార్థ పిశాచం ఆవేశమైనవాని ముఖం చూడండి.
ఎదుటి వాని గుర్తించలేనంతటి గ్రుడ్డివాడు వాడు.
తనంతటివాడు లేడనే విఱ్ఱవీగు వెఱ్ఱి వాడు వాడు.
అతడొక నాడు రాజు ఒకనాటి మంత్రి ఒకసారి అధికారి—
అతడు తానెవడైతేనేమి? తానొక ప్రజాసేవకుడ నని మరచినవాడు

అధికార మొక విశృంఖలమైన దొరతనమని భావించేవాడు.
ఆక్షణమే అతడు ప్రజలచే "అధిక + అరి,,
అధికారియని ద్వేషింపబడినవాడు.
ఆపదవి యతనికి ఆవుకు గడ్డి వేసినట్లుకాక పాముకు పాలుపోసింది
అధికార మధుపాన దాహం పదవీ వ్యామోహం అతని వివేకాన్నే
హరించాయి

అతడు అన్నీ తెలియుననే తెలివి మాలినవాడు,
విలువైన బట్టలతో నుండియు పరువు బోగొట్టు కున్నవాడు,
అతడొక బలవంతుడ ననే బలహీనుడు
స్వతంత్రుడ నను కొనే స్వార్థ పిశాచ పర తంత్రుడు.
అతడు, కాళ్ళుండి నడవలేడు కండ్లుండి చూడలేడు
చెవులుండి వినలేడు నోరుండి పలక లేడు.
అతడు తా నత్యంత పరతంత్రుడు
అతడు తనవా రెవరో తాను గుర్తించడంలేదు
ఎవరు నీవని ఎదురుప్రశ్న వేస్తున్నాడు.
ముఖము ముంగలి మురిపాల నవ్వులతో వెనక వెక్కిరించే
పొట్టనించే సానిజాతి యన్న అతని కత్యంత ప్రీతి.
కాళ్ళు పట్టుకొన్న వారిని కడదన్ని పారేస్తున్నాడు.
జుట్టు పట్టు కొన్నవారికి చుట్టు ప్రదక్షిణం చేస్తున్నాడు.
అతడు మిట్టను పల్లమని పల్లముమ మిట్టయని భ్రమిస్తున్నాడు
అతడు పడిపోక తప్పదు పడిపోక తప్పదు.
అతనిలోని భూతత్వం ఆత్మ ప్రదక్షణం మాత్రమే చేస్తున్నది.
ఆకాశ తత్వం అమావాస్య నిశియై మిత్రునే కోలుపోయింది.
అగ్ని అంటిన కాల్చేదే కాని ఆత్మప్రకాశం కోలుపోయినది
ప్రాణాలిచ్చే శక్తియుడిగి వాయువు ప్రళయతాండవం చేస్తున్నది
అతని హృదయం దోషం ద్వేషం అసూయా నిశాచరుల వశమైంది
అతడు తనవశంలో తానులేడు - దయనీయుడు-

# స్వార్థం అధికారి కావాలంటే

స్వార్థపరుల సంఘర్షణ లోపల రాజకీయ మొక చిదంబర రహస్యం
పదేపదే పార్టీల మార్పిడిలో వేషాలు మార్చే వేశ్యల లాస్యం
తాను మొదలు తత్వం తరవాత అనే అంతర్దృష్టిలో
ప్రజల ప్రగతి జోస్యం
పైపూతల సౌమనస్యంతో నీతి నిజాయితీ నిర్మలభాష్యం.
సర్వకాల సర్వావస్థలలో స్వార్థదేవతా ఉపాస్యం

వంచకుణ్ణి చూస్తే మేధావి యనే ఉద్దేశ్యం
మంచివాడు వట్టి తెలివిమాలిన దద్దన్న అనే హాస్యం
ప్రవచనాల్లో బ్రహ్మాండంగా వినిపిస్తుంది ప్రజాదాస్యం
బలము పలుకుబడి పైసగలవాన్ని జూస్తే
ప్రొద్దుదిరుగుడు పూవు ఆస్యం
మాటల్లో గమ్మత్తు-పదవుల మధుపాన మత్తు
కూట నీతిపరులతో పొత్తు దొంగసన్యాసులకే సొత్తు
తానే కావాలె ప్రధానమూర్తి తనకే రావాలె అఖండకీర్తి
పరుని కివి వస్తే పట్టరాని ఆర్తి వాణ్ణి పడగొట్టే వ్యవహార పూర్తి.
రావణాసురునికి రాముని వేషం వేయించి రంగం రక్తి కట్టించాలె
మాటల్లో దీనులపై దరిద్రులపై మమతలెన్నో ప్రవహించాలె
తనవాన్ని చూచి పంక్తిలో తక్కనవాళ్ళ నోళ్ళుగొట్టి వడ్డించాలె.
పెదవులపై వినయ విధేయత పెద్దవారియెడ గనబరచాలె
పదవులకై పల్కుబడులకై పచ్చిగడ్డి కరవాలె
మంచివా డనిపించుకోనేలా, లంచాలను కాజేయాలె
అన్యాయం న్యాయంజేసి అందరిలో ఒప్పించాలె
అపసవ్యం, సవ్యహస్త మని అద్దంబెట్టి చూపించాలె
పాపాత్ముల పుణ్యాత్ములుగా ప్రచారంచేసి మెప్పించాలె
పుణ్యాత్ములు పాపాత్ము లని పుక్కిటి పురాణాలు చెప్పించాలె-
పదిసార్లిదే పరమ సత్య మని కల్లను నిజ మనిపించాలె-
కడుపున పుట్టిన బిడ్డనువలె కపటమ్మును కనిపెంచాలె
తన మనస్సులోని నిజాన్ని బ్రహ్మకు తెలియ నీకుండ
ఉక్కుతెరలో ఉంచాలె
అభేద్యమైన పర హృదయాన్ని అర్థం జేసికొనే పాండిత్యం గడించాలె.
తనకు లాభ కరమైన మార్గాల్లో, దయా ధర్మాల అడ్డు రానియ్యొద్దు
తనకే అన్నీ తెలియును ఎదుటివాడు చెక్కని మొద్దు
స్వార్థం అధికారం కోరితే చదవాలెను ఈ శాస్త్రమ్మును

# వారు నిశాచరులు, పిశాచాలు;
# నేను మామూలు మనిషిని.

నేను మామూలు మనిషిని. నే నెవరి కనులకు కనబడ నంతటి చిన్నవాణ్ణి
నే నొకణ్ణి ఉన్నానని ఎవరూ అనుకోరు అందరిలో నేనొకణ్ణి
పదార్థాల పాటిస్తారుగాని అణువు నెవరు అడుగుతారు
అలిగి అణువు చిట్లితే మాత్రం అంతా ప్రళయమే సుమా
నేను పదవులు ఇచ్చేవాడనే కాని నాకెవరూ పదవి ఇయ్యరు

నేను గౌరవం ఇచ్చేవాణ్ణే కాని నన్నెవరూ గౌరవంచెయ్యరు
నేను భాగ్యాలు ఇచ్చేవాడనే కాని నాకెవరు భాగ్యమిచ్చు వారులేరు
ఇచ్చేవానికి ఇవ్వడమెందుకు ఏమితక్కువ వీనికనుకుంటారోఏమో?
పెద్దలంతా పదవీ భాగ్యాలు పంచుకునే సమరంలో సదమదమైతున్నారు
ఆలూమగల అంతః కలహాల్లో కన్న బిడ్డ కన్నీ రిడి యేడిస్తే
యెవరు పట్టించుకుంటారు
నాకుపదవులు భాగ్యాలు ఏమీ వద్దు కూడు గూడు ఉంటే
మణిగి పోతుంది నాసద్దు
నేను ఒక మామూలు మనిషిని. చెమటల్లో స్నానంచేసి
మట్టి బురద గంధ లేపనం మైకి రాచుకొంటూ
వానకు సత్రంలేక ఎండకు ఛత్రంలేక
చావలేక బ్రతుకు నీడుస్తున్నాను,
బ్రతుకలేక అనుక్షణం చస్తున్నాను
ఉన్నవాడే బ్రదికి యున్నవాడని తెలుసుకొన్నవాడను
చాల చిన్న వాడను. కాలంతో దెబ్బలు తిన్నవాడను
తింటున్నవాడను ఎప్పుడీ గతి ఇంతేనా యని అడుగుతున్నవాడను.
ఒక వైపు మతాల కలహాలు నా మనస్సును ముక్కలు చేస్తున్నాయి
పైనుంచి ఏకతా వేదాల వల్లెవేస్తున్నాయి
చేసే తంతుకు చెప్పే మంత్రానికి పొత్తుకుదరక చిత్తై పోతున్నాయి
వర్ణాలు ప్రాంతాలు నా వసుధైక కుటుంబాన్ని వేయిచెక్కలుచేసి
వేరుపడి పంచుకొన్నాయి
అడ్డుగోడలు పెట్టు కొని అట్టిల్లోకాపురాలు చేస్తున్నాయి
ఇంటిమందం ఇంతోఅంతో వెలిగే దీపాలను పొద్దుగల ప్రేమ రూపాలను
ప్రపంచాన్నే వెలిగించే భాస్కరుడని ప్రచారం చేస్తున్నాయి

నవ్వాలో ఏడ్వాలో నాకే తెలియడం లేదు.
మామూలు మనిషిని నేను మనిషికి జీవంపోసే మనసును నేను
మనసును బ్రదికించే మమతను నేను
సాటి వానివలె ఉండగోరే సమతను నేను
నా మన సనే రంగారు బంగారు లక్క చిట్టిని పగులగొట్టినారు
అగ్గిపెట్టి వినాశం చేసి వినోదించు తున్నారు
ఈ రాక్షసుల బారినుండి తప్పించుకోవాలని రాత్రింబవలు ఆరాటం
నాగుండె గూట్లో నవ చైతన్యదీపం వెలిగితే నక్తంచరులకు కన్నెఱ్ఱన
ఆ దీపాన్ని మలిపే కోపాల తాపాల బుసలు కొడుతున్నారు.
కళానిధి కనికరించి కాస్త వెలుగు ప్రసాదింప వస్తే
అధికార మధుపానపు మబ్బులు అతని వెలుగు లందకుండా
అడ్డు వస్తున్నాయి
ఆకాశాన్ని ఆవరించిన యా చీకటి వేకటిదాల్చి
వేల భూత పిశాచాల ప్రసవిస్తూవుంటే
ఆమె భ్రూకుటిలో నల్ల నాగులు బుస కొడుతున్నాయి
నల్లని యాకారంతో పల్ల జెడలు విడిబడ
చెడుగుడులాడే చీకటి పిల్లల్ని చూడండి!
రూపాల్లో గుట్టలు, పెద్ద పొట్టలు, కత్తుల్లాంటి పండ్లు,
నిప్పులగ్రక్కే తారకల కండ్లు
రోషం బుస కొట్టే నాసారంధ్రాలూ, త్రాటి చెట్లెత్తుగానిల్చి
ఆకాశ వీధుల్లో ఆడి పాడుకుంటున్నారు
అమాయక ప్రాణుల అంతరంగాలకోసి తింటున్నారు.
ఆర్తనాదం చేసే అతడెవ్వరు: చీకట్లో దీపం వెల్గించి చూస్తాను
అయ్యో అతడు నా తమ్ముడే భయపడకు తమ్ముడూ

దీపం వెలిగిస్తున్నాను, పాపం ఫలించి నేల రాలుతుం దిక
భయపడకు, స్నేహపు చమురు పోసి అనురాగ జ్యోతిని వెలిగిస్తాను
నేను కవిని, నేను జాతికే కన్నును నాకు చీకటి సహించదు.
చీకటిని చీల్చే వెలుగును ఎలుగెత్తి ఆహ్వానిస్తాను.
నీకు మార్గదర్శినై లక్ష్యం చేరుదాక వీడకుంటాను
చీకటి తెరలు చించివేసే మిత్రకరాలు నా కలాలు
చీకటి గుండెల్లో గ్రుచ్చుకునే శరాలు నా కలాలు
ఉదయానికి అభ్యుదయానికి పళ్ళెం నాకలం
కాలాశ్వాన్ని చెప్పు చేతల్లో నడిపించే కళ్ళెం నా కలం
చీకటికి కొండ గుహల్లో గోరికట్టి తలుపెట్టి
తీయ రాకుండా వేసే గొళ్ళెం నా కలం
కలానిధి నోట నిశాచరులు దరి జేరనీరు నన్ను
భయపడకు తమ్ముడూ! నీవు నేను మామూలు మనుషలం
మన మిద్దరం కలుద్దాం ఆ నిశాచర పిశాచి మదమణుద్దాం
నేను నీకు నీవు నాకు తోడు
నా తోడు; నేను నీతోడే ఉంటాను నమ్మె

# ఎవరీతడు?

ఎవరీతడు? ఎవరీతడు? ఏమిటి యా పరత్వం, ఏమిది యా వరత్వం
నరనరాలు వెదకిచూస్తే కనబడదే నరత్వం.
మాటాడడు; చూడడు: మనమూ మనుష్యులమే అని అనుకోడా?
ఆకాశంలో ఆడుతున్నాడు, అందుబాటులో లేడు.
అఖిల తారకల్లో అపర చంద్రబింబము ననుకొంటున్నాడు.
హాని వృద్ధుల మాట ఆలోచిస్తునే లేడు.

కండగల శరీరం, కండ్లు మధుమత్తతా పూరం
చుక్కల్లాంటి వస్త్రాలు— సుందరమైన సౌధాలు
ఎండకురాడు ఏర్ కండిషన్‌తో బ్రదికే వాడు.
చెమటొస్తే భరించ లేడు చెలువం కాపాడుకొంటాడు.
చెడక ఉండాలె ఈ యిస్త్రీమడుపులని అవిచెప్పినట్లు వింటున్నాడు.
ఎవరీతడు? ఎవరీతడు? ఏమిటూ పరత్వం ఏమిటూ వరత్వం-
తన యంతటి వారితోనే, తానెప్పుడూ, మాటాడుతాడు.
అంతకు తక్కువ వారికి అసలే దర్శన మీయడు-
కాలుకు మన్నంటనీడు. కార్లలోనే తిరుగాడుతాడు.
కలవారిని చూస్తేనే కాస్త నవ్వి మాటాడుతాడు.
కలవారిని చూస్తేనే చేయి చేయి కలిపి మాటాడుతాడు
అవసరపడు వారి జూస్తే వెలయాలి ప్రేమలు ఒలక పోస్తాడు-
తక్కిన వారిని చూస్తే కుక్కలకంటె చులకన జూస్తాడు.
ఎవరీతడు? ఓయబ్బో! ఎంత పరత్వమో చూడు!
అధికారపు నిషాలోనే అహర్నిశలు తేలి యాడుతాడు
వైభవాల వలయాల పంజరంలో సుఖపు పప్పుకు మరగి
శుకమై కట్టుబడినాడు
ధనపుపెట్టె చూచుకోని తనను తానే మరచి పోతాడు
ఈ లోకం లోనే ఉండి యే లోకంలోనో ఉంటాడు.
కన్నులు తెరచియే కలలు గంటూ ఉంటాడు.
ఎవరీతడు? అబ్బబ్బో! ఎంత పరత్వమో చూడు!
అహం భావపు టాకారమా గర్వపు టవతారమా
విస్సన్న జెప్పిందే వేదం నంబి పెట్టిందే ప్రసాదం-
ఎవరీతడు? తనవారికే పంక్తిలో చేయివిడిచి వడ్డిస్తాడు
పరవారు నోరువిడిచి యడిగినా ప్రసాద పాత్ర బోర్లేసి
ఏం జేయా లంటాడు

తడు దేవతయా? కాదు కాదు
తడు మానవుడా? మాలో కలిసినట్లులేదు.
తడు రాక్షసుడా? అలా అంటే ప్రాణంపోదు?
తడు స్వార్థ పరుడా? పైకి అలాకనబడదే
తడు పెద్ద మనిషా? వయస్సునుబట్టి అలాఅనుకోవచ్చు
తడు అధికారియా? అధిక + అరి అంటే ప్రాణంతీస్తాడు.
ండితుడా? పండితులు సమదర్శను లంటారే!
ుహాత్ముడా? అత డన్ని రూపాల్లో పరమాత్మనే దర్శిస్తాడట కదా?
తడు మహారాజా? యిప్పుడు రాజు లెక్కడున్నారు?
ేక మహామంత్రియా? అబ్బే! ఎంత మాటన్నావు!
ునమెన్నుకున్న మాన్య ప్రజాప్రతినిధులా
అంత మాటంటే మనమే మూర్ఖులం అని పించుకుంటాం.
ురి యెవరీతడు? ఎవరో, శివుడో? మాధవుడో? కమల భవుడో!
ుగ్గురెలాఒకరై తాడు? లోకాల నేలే శక్తి, లక్ష్మిపై రక్తి భక్తి,
ున పాలసీ మూడోకంటివానికి తెలియనీయని యుక్తి ఉన్నాయి గనక
ుగ్గురు మూర్తుల ముద్ద గట్టిన మూలవిరాట్టై యుంటాడు.
ుతే నీ మొర అతనికి చెప్పుకోరాదా? నావెత అతనికి కథ
ా మొర అస లతని చెవికి చేరదు. చేరినా అతని మనసుమారదు
ాకోసం ఆలోచించడానికి అతనికి తన పని తీరదు,
అతని ముం దిప్పు డెంత వాడైనా ఎంతవాడు
ున్నచూచి నవ్వుకొంటున్నాడు.నిర్లక్ష్యంగాజూచి తృణీకరిస్తున్నాడు
ాని రామరాజ్యంలో ఆతృణం బ్రహ్మాస్త్రంగా మారడం తెలియదు.
ుతడు నా వాడా? తన వాడా? ఇంతకూ ఎవరీతడు?

# ఆశీస్సులు — అక్షరాక్షతలు

## (శ్రీ విజయలక్ష్మి ప్రసాదులకు)

కోదాటి సువంశ పయః కూపార సముద్భూతా!
కోమల హృదయా సుందరగుణభూషణ సముపేతా!
రాజ మల్లు సచివాగ్రణి రమణీయ తనూజాతా!
రాజానన విజయలక్ష్మి ప్రసాద పాణిగృహీతా!

మోహన గగన పథమ్ముల మురిసెడి తారాగణమై
వినీల జలనిధి యొడిలో విరిసిన ముక్తామణులై
సరస రసా లాంగణమున గురిసెడి సుమనస్రజమై
మౌక్తికాక్షతలు తావక మౌళిస్థలిభాసిలుతన్.

సంసార సముద్ర మథన సంభూత విషామృతములు
కష్టసుఖములై రాగా కష్టమ్ముల బోనడచి
ఇష్టసౌఖ్య సుధానిధుల నెందు మౌళి ధరియింపగ
హరపార్వతులన నొకరై యలరారుడి దంపతులు.

సౌందర్యముతోపాటుగ సౌజన్య గుణాల వెల్గి
తావిగూడు పూవులవలె తలదాల్చగబడుడుజగతి
సూత్రమునంగట్టుబడిన సుమముల వలె ధర్మమునకు
కట్టుబడుచు సంఘమునకు గళహారములై మెలగుడి.

అంధకారమును దునుమగ ముందువెనుక లాడెడియా
చందమామ నపహసించు జాతీయ జవాహరులన్
సుందరులను సుకుమారుల శూరుల సత్యవిచారుల
ఎందరినో కాకుండా యిరువురి గని మురియు డవని॥

# ఏం మారింది మనిషి స్వభావం?

ఏమి మారింది నాగరికతతో మనిషి భావం?
ఇంకా పోనేలేదు క్రూరమృగ స్వభావం.
ఇంకా చిన్న చేపను పెద్ద చేప తినడం సహజమని
బలుస్తునే ఉంది స్వార్థ జీవం
అదో ఇంకా వినబడుతునే ఉన్నది దౌర్జన్య శంఖారావం
ఇంత వరకు జీవ నదిలా ప్రవహిస్తూనే ఉన్నది దీనుని బాష్పస్రావం

ఎటు జూచినా నరబలి యజ్ఞధూమాలే
ఎటు జూచినా మారణ హోమాలే
ప్రతి మేధావంతుడు చదివేవి రాక్షసుల చదువులు,
కోరేవి ఇంద్ర పదవులు
ఏమి మారింది మనిషి స్వభావం ఇంకా పోనేలేదు క్రూర పశు భావం
ఇంకా చదువుకొన్నవాడు చదువు రాని వాణ్ణి
పశువు క్రిందనే జమకడుతున్నాడు; లాభ పడుతున్నాడు,
అధికారి అనధికారిని బానిసల క్రిందనే లెక్కబెడుతున్నాడు
వెట్టి గొడుతున్నాడు
ధనికుడు నిరుపేదను ధనంతో కొనేస్తున్నాడు
ముడిసరుకుగా అమ్మజూస్తున్నాడు
బీదవాడు దొంగిలించకున్నా నమ్మరాని దొంగే
ఉన్నవాడు పశ్యతోహరుడైనా వెడ్డి మంగే
ఉన్నవానివైపే అందరూ ఉన్నారు.
లేనివానివైపు ఎవరులేరు నా అనేవారు
లేనివాడు మరీ లేనివాడౌతున్నాడు.
ఉన్నవాడింకా ఉన్నవాడౌతున్నాడు-
వ్యాపారం ఉన్నవాణ్ణే వలచింది, వ్యవసాయం వాణ్ణే పిలిచింది.
చదువులు సంస్కారాలు వాని యింటిముంగలి కామధేనువులు
పదవులు భాగ్యాలు వాని పెరటి కల్పతరువులు
వద్దన్నా వాణ్ణే వలచి వస్తున్నవి వైభవాలు.
పిడి పిడీలు వారికే అంకితం సుఖాలు
ఏమిటీ అరాచక విధానం-అసలెవరీ దుర్గతికి ప్రధానం-
అటు చూడండా పక్షపాత రోగి-కుడివైపు బ్రతికాడు
ఎడం వైపు చచ్చాడు

ఎలా నడుస్తాడు ఒంటికాలు కుంటి నడకతో
మూల్గుతూ చావాల్సిందే అంటుపెట్టుకున్న పడకలో,
ఎన్నటికి ప్రసరిస్తుంది అనాధ జీవులపై ఆశాకిరణం
ఎవరిని వేడాలె దీనికి శరణం ఎప్పుడు తప్పుతుందీ బలవన్మరణం
ఏమి మారింది నాగరికతలో మనిషి స్వభావం-
ఇంక చావలేదు స్వార్థప్రభావం-
అంతా నేనే అనే అంతా నాకే అనే అహంకార మమకారాల
కత డందె వేసిన చేయి
అనేక యామాలు వచ్చినా అతని సరకులకే శుక్లపక్షపు రేయి-
నేనే అందరిలో గొప్ప-ఎవడులేడు ప్రపంచంలో నేను దప్ప
నా మాటలు వరాల కుప్ప—మీరు వాగేదంతా వొట్టి చొప్ప-
నేను మీకిస్తాను ధాన్యం దులుపుకొని గడ్డి, తాలు
పశువులు మీరు నాకై కురియాలె రుచిగల పాలి వర్షాలు—
అదో! అటు చూడండి! ఆ, నర మాంసానికి మరగిన పులి
అది చేస్తున్నది నర లోకాన్నే హాలా చలి
ఆ నెత్తుట దడిసిన ముఖం—అది నరక ముఖద్వారానికి మచ్చు రకం
ఆ భయంకర క్రోధారుణ నేత్రాలు—
అభ్యుదయ బాల భాస్కర అస్తమాన దృశ్య క్షేత్రాలు—
ఈ విషమ సమస్యలే నాకావ్య వేదనకు కారణాలు-
వానితో చేయాలె నా కలం రణాలు
అటు చూడండి! అవి, అజ్ఞానపు పశువులు
అన్నెం పున్నెం తెలియని శిశువులు
ఆ శిశు పశువుల అజ్ఞానం చీకట్లో నిశాచరులై విహరిస్తున్నారు వారు
వాళ్ళు అపశకునాల గుడ్లగూబలు-అపరాత్రి విహరించే గబ్బిలాలు

వాళ్ళు మానవ మాంసానికి మరగిన పులులు-
నర మేధ యజ్ఞం చేసే బలులు
వాళ్ళు గోసాయీ రూపంలో నున్న కసాయీలు
వాళ్ళు సాధు రూపంలో నున్న వ్యాధులు
ఆ గోవు కసాయివాడు వేసే పచ్చిగడ్డిని నమ్మింది
ఆ చేప ఆస చూపిన యెఱను చూచి మోస పోయింది
మేసింది గడ్డి కట్టలుగావు మెత్తని కత్తులు
వేసింది యెఱగాదు-కత్తుల పొదిగిన మఖుమల్ ఒర-
గాలం గుచ్చిన చేప నోరు తెరచింది
గోవు అంభా అని అరచింది-వానికి నోరు లేదు భాష రాదు
ఈ నిస్సహాయ ప్రాణులకు ఈగతి లేని మూగ జీవాలకు
కోర్టు లేదు పోలీసు బలగం రక్షింప రాదు
వ్యాధునికి హృదయం లేదు. ఉన్నాదానికి కనికరం నరం లేదు-
ప్రాణం లేని కత్తి కోతలో వెనుక ముందాడినా
బాణం వేటాడటంలో వెనకంజ వేసినా
గాలం మోము ప్రక్కకు ద్రిప్పి విముఖత్వం కనబరచినా
వ్యాధుని కండ్లలో పదును లేదు, వీరి ఆపద పోదు
బక్క గోడ్లు చస్తేగా నక్కలవి ప్రభుత్వాలు
తాను జెప్పిన ధర్మం వినలేదని బుద్ధ భగవానుడు పుట్టబోనన్నాడు
మహావీర జైనుడు మత ప్రబోధాలే మానుకొన్నాడు
దౌర్జన్యం పనికి రాదన్న గాంధీని ఇలాంటి దుర్బల హృదయులు
పనికి రారని గుండె కాల్చి చంపినాము-
మానవ లోకానికి మరగిన పులి
అది నరలోకాన్ని చేస్తున్నది హాలా చలి
ఏం మారింది నాగరకతతో మనిషి స్వభావం?

## కూలిపోయే కొమ్మ

మత వర్ణ విభేదాలతో మానవ జాతిని చీల్చి చెండాడినారు
ప్రాంతీయ భాషా భేదాలతో అఖండ భూభాగాన్ని ఆక్రమించి
హద్దు గోడలు పెట్టుకున్నారు
మత సమాఖ్య సమత సమైక్యతల చాటి చెప్పవలె
ప్రాంతాలు వేరైనా స్వాంతావసరాలు సమానమే అని గుర్తించాలె
భాషా విభేదాలు భావ ప్రకటనకు పర్యాయ పదాలుగా తెలియబడాలె
వర్ణాల రంగద్దాల విభేదాలు వస్తు విభేదాలు కల్పించజాలవనేది
మరువరాదు
ధనిక దరిద్ర భేదాలు పాలక పాలిత భేదాలు పాడై పోవాలె
ఎత్తులు తీసి వంపులలో నింపి ఏకధాటిగా సమమార్గం నిర్మించాలె
ఈ రాజ మార్గంగుండా ప్రజారథం సుఖ గమ్యం శాంతంగా చేరాలె.

# నవోదయం నవ్వింది.

అబ్బా! చీకటికొట్టు-వెల్తురును నెట్టేసింది-గాలిని కట్టేసింది

ఇందులో ఈ బందెలో ఇలా ఎంతకాల ముండాలె

కన్నులుండి గ్రుడ్డినైనాను. కాళ్ళుండి కుంటినైనాను

నోరుండి మూగనైనాను. మనసుండి మ్రోడునైనాను

నా కాళు కట్టివేశారు నోరు కుట్టివేశారు తమ గుప్పిట్లో పట్టివేశారు

నను దొరల రూపంలో ఉన్న దొంగలు దోచుకున్నారు

బందెలో దాచిపెట్టారు

* * * *

ఈ చీకటి కొంపలో భూతాలు కాపురం చేస్తున్నాయి
నిశాచరులు రాజ్యమేలుతున్నారు
నన్ను తమ దమన నీతి ఉక్కుపాదాల క్రింద
నల్ల చీమగా నలిపివేస్తున్నారు
నేను చావలేక బ్రతుకుతున్నాను. బ్రతుక లేక చస్తున్నాను
ఈ నిశాచరుల గుండెలు నల సరపు బండలు. వానికి నెనరులేదు
మమత లేదు ఒంటికి అసలు చెమటన్నది లేదు
ఇవి నిశీథపు నింగిని నిప్పుల కండ్లతో పొలిస్తున్నాయి
ఎదురు లేని యేలికలై లోకాలను గోలిస్తున్నాయి
చోరత్వంతో సమతల దో చేస్తున్నారు
జారత్వంతో మమతల కోసేస్తున్నారు
గగన మంతా కల్లా కపటాల కాలకూట విషంతో అలికి పూశాయి
నల్ల నాగులు ఇల్లంతా అల్లుకొని గరళపు కోరల ముళ్ళువరచాయి
కన్ను విప్పలేను కాలు కదపలేను అన్న మడుగలేను ఆకలికి తాళలేను
ఈ చీకట్లకు దారిలేదు తోవలేదు గమ్యమంటూ కానరాదు
నిప్పు రవల లాంటి నక్షత్ర నేత్రాలతో నింగిలోకి నిక్కిచూస్తున్నాయి
వెల్తురు ప్రవేశించకుండా వేయి గండ్లతో
విశ్వమంతా పహారా ఇస్తున్నాయి
క్రొత్తగా ప్రాచీ దిశలో ప్రవేశిస్తున్నాడు. అతదెవ్వడు? (అని).
గుడ్లగూబలు గుసగుస లాడుకొంటున్నాయి. శకుని మామల్లా
ఎవడో కాడు తాను మాత్రమే ప్రకాశించి
తక్కినవాటిని ప్రకాశింప నీయని
మన నక్షత్ర నాయకుల్లోని వాడే మరెవడో కాడులే
చీకటి పిల్లలకు ధోకాలేదు. రాకాసులకు రాజ్యాధికారం పోదు
అవధుల్లేని అంధకారపు అత్యవసర పరిస్థితిని
అతిక్రమించడానికెవడు సాహసిస్తాడు

*    *    *    *

చీకటి పాలకుల వేషంతో చిత్రంగా నక్షత్రంగా వచ్చిన
వేకువ చుక్క వేళ కాచి చీకటి గుండెల్లో
బాకై పొడిచింది మేకై దూసింది. ప్రాణం తీసింది
కారు చీకటి గుండెలోని కుండల కొద్ది రక్తం ఏరులై పారింది
దిక్కులు తట్టి రక్తపు మడుగులు కట్టింది
చుక్కలన్నీ బిక్కమొగాలువేసి చూశాయి
అదో! ఎఱ్ఱ తురాయి ధరించిన ఎవరో వీరుడు ఎగసి ఎగసి పడుతూ
గళమెత్తి కొమ్మూది జయగీతం పాడుతున్నాడు
చీకటి, నోట్లోనుండి రక్తం గ్రక్కింది దాని పని బిక్కింది
మ్రింగిన మన మిత్రుణ్ణి మ్రింగినట్లు వెలి గ్రక్కింది
రక్త సిక్తమైన మేనితో రాపిడి పట్టిన రత్నంలా మెరుస్తు
మండిన గుండెల మంటలతో చీకటింటికే చిచ్చుపెట్టినాడు
మన మిత్రుడు లోకాలకే వెలుగు భిక్ష పెట్టినాడు
చీకటిల్లు కాలిపోతున్నది భస్మమై కూలిపోతున్నది
దశ దిశల రాలిపోతున్నది. విష సర్పాల్ పారిపోతున్నాయి
ఏడు గుఱ్ఱాల బగ్గీమీద ఎవరో కాదు మన మిత్రుడే వస్తున్నాడు
క్షతగాత్రుడు మన మిత్రుడు నిశీథపు ఉక్కుకోటకు నిప్పంటించాడు
చీకట్ల జైలు తలుపుల ఉక్కు మొలలు చుక్కలై ఎక్కడి వక్కడ
రాలిపోయినాయి తలుపులు కాలి కూలిపోయినాయి
మిత్రునికి సరసుల హృదయాబ్జాలు దరహాసంతో
స్వాగతమిస్తున్నాయి
కొమ్మలు కరాల దాల్చిన పూల విసనకఱ్ఱలతో
కమ్మతెమ్మెరలు విసరుతున్నాయి
గతిలేక చెట్లకాపురాల్ చేస్తున్న పక్షుల అవిరాగాను బంధంతో

మిత్రుడు పలకరించాడు. అవి పులకరించాయి
దిక్కులు విడిచే మంచు కన్నీళ్ళ వెచ్చని కరాలతో తుడిచాడు
కాలు కదల్చే అధికారం లేక కండ్లు మూసుకొని కాలం వెళ్ళబుచ్చే
ప్రాణాల బంధనాలు త్రెంచినాడు కను విప్పు గావించినాడు
బందె నుండి విడిబడిన పాంథుడా! నడుం కట్టి నడువు
గడువు ముగిసే లోపల గమ్యం చేరుకోవాలె తేరుకోవాలె
అదో చూడు! నలుప్రక్కల ఆక్రమించి శిశిరాంత వసంతం
రాగరంజితమై నవ్వుల పువ్వులు రువ్వుతూ నవ్యవాసనల పులుముతూ
నవమోహన రాగంతో కోకిల కల మధుర స్వనాల జయగానం
పాడుతూ

నీకే మంగళ నీరాజనం పట్టింది స్వేచ్ఛా రాజ్యానికి పట్టం గట్టింది
ఫలోన్ముఖ పంథాలో నడవడానికి నడుం కట్టింది
చీకటి జైలు కాలిపోయింది తెల్లని భస్మమై దిక్కుల కూలిపోయింది
ఇంక భూతాలు నిన్ను భయపెట్టలేవు నీయింట కాలు పెట్టలేవు
నీ కాళ్ళు కట్టలేవు నీ నోటిని కుట్టలేవు
కాలరాత్రి కాలిపోయింది. నవోదయం నవ్వింది
మన స్సరోవరం సంక్షుభితం కాక శాంతంగా ఉంది
స్వేచ్ఛా కమలం స్థిరంగా హాసించింది
కవి షట్పదం గానం చేస్తున్నది సమతా గీతి
నవోదయం నాట్యం చేస్తున్నది మమతా రీతి.

# ఎందుకింత కోపం?

[19-11-1977 నాటి, తీరప్రాంతపు తుఫాను విలయ తాండవమునకు తపించి]

ఎందుకమ్మా ఇంతకోపం? ఏం జేశాం మేము పాపం
చిందులు ద్రొక్కుతున్నావు చింతనిప్పులు గ్రక్కుతున్నావు
ఎందుకమ్మా అలా మండిపడుతున్నావు
ఏమన్నామని మమ్మ చావగొడు తున్నావు
ఏమిటలా నోరునెత్తిన బెట్టికొని అరుస్తున్నావు
ఎదురైన వస్తువు నలా నేలకువేసి చరుస్తున్నావు.

ఎందుకింత అఘాయిత్యం ఏమిటా అభిజాత్యం
నాలుకలు గేరుతున్నావు నాగుపాములా బుసకొడుతున్నావు
ఏమిటా రూపం ఇంటివాళ్ల మీదనేనా నీ ప్రతాపం
శివము దూలుతూ చిందులు త్రొక్కుతున్నావెవరువేశారు ధూపం
నీ కోపంలో కొంపలారి పోతున్నాయి.
మా కాళ్లు కంపరమెక్కు తున్నాయి
నల్లని తల్లివైనా కడుపు చల్లని తల్లి వనుకున్నాము
పిల్లలను కొట్టిచంపడానికి చేయెలా వచ్చింది నీకు
నిన్నునమ్మి రొమ్ముమీద చెయ్యివేసుకొని నిదుర బోయేవాళ్ళం
నమ్మిన పిల్లలను నాశనంచేయడం అమ్మచేసే పనేనా?
మరియాద మీరని మహాతల్లి విలాచేస్తావను కోలేదు
మహా విశాలాంతరంగం గల మానినీ మణి విలా చూస్తా వనుకోలేదు
నీ ఉప్పుతిని బ్రతికేవాళ్ళం నీ కపరాధం జేస్తామా తల్లీ!
నీ లక్ష్మీకటాక్షం ప్రసరిస్తేనే మా బ్రదుకులు కదా
నీకే ద్రోహం చేస్తామా? నీ కెందుకమ్మా ఇంత కోపం
చంద్ర బింబం లాంటి కొడుకులను జూచి
నింగినంట పొంగిపోయే దానవు.

ఆ పుత్రప్రేమ యిప్పుడెక్కడ మాయమైంది చెప్పు.
ధర్మగుణాల మీద అమృతం జిల్కి దౌర్జన్యాలపై విషంగ్రక్కేతల్లివి
ఆ వివేక మంతా ఏమైంది అలా మండి పడుతున్నావు.
కరువులు కాటకాలు మమ్ము పీడిస్తే కబళమన్నంపెట్టాలని
కరుణరస మేఘం మాపై వర్షించే దానవే
సిద్ధాన్నం వడ్డించిన విస్తట్లో ముద్ద గలిపి తినబోతున్న
చిన్న బిడ్డల నోటి ముంగలి బుక్క ఎత్తగొడితే నీ కేమొస్తుంది?

ముత్యాలు నీ యింట మూల్గుతున్నాయి
రత్నాలు నీ యింట రాసులు బడి ఉన్నాయి
ఏం తక్కువ నీ కని మా ముందరి అన్నం తీసి
మా కడుపు మీద కొట్టావు
చల్లని తల్లివని స్వాంతంలో నమ్ముకొన్నాం
నల్లిపిల్లులవలె మమ్మల్ని నలిపి పెడతా వనుకోలే
నీకు ఇష్టమైతే నెత్తిమీద ఎక్కించుకొని త్రిప్పుతావు
కాకుంటే కండ్లెట్ల జేసి విసరి కొడతావు.
భద్రకాళివై రుద్రరూపంతో భయ పెడతావు
అలా మీద విరుచుక పడుతున్నావు. పసిపాపల పిసికి పెడుతున్నావు
కావలసినన్ని ప్రాణుల కడుపున పెట్టుకొనిసాకే తల్లివి
కన్నగోద్రాలివి కాగలిగినా వెట్లమ్మా!
అలా విరుచుకొని మీదపడితే
నిన్నెవరు పట్టు కొనగలరు
నీ కోపానికి ఎవరు తట్టుకొన గలరు.
పగబట్టి వెంటాడే పాములా పరుగులో వచ్చి
మా పాదాలు చుట్టుకొన్నావు కుట్టి చంపావు
ఈ ఘటాల్లో జీవనాలు నింపి
ఈ ఘటాలనే పగులగొడుతున్నా విదేం పిచ్చి
నీప్రసన్న గంభీర స్వభావం జూస్తుంటే
దయ జూస్తున్నావో భయపెడుతున్నావో తెలియడంలేదు
మీ చంచల స్వభావాల ఎన్నడునమ్మరాదు
మీ ప్రసన్నత గూడ భయంకరమనే అపవాదు
మీపెద్దవాళ్ళ పనంతా ఇదే

## కూలిపోయే కొమ్మ

ఎవరన్నా బాధ పెడితే అమ్మా అని చెప్పుకొనే వాళ్ళం
కన్నతల్లే విషంబెడితే కనికరించే వాళ్ళెవరున్నారు
అమ్మా ఇలా భయపెడుతూ
నిన్ను నమ్మకుండా చేసికొన్నావు
అబ్బో! అబ్బో! ఎంత కోపం ఎంత తాపం
నీ కోప వాతావరణంలో దూదిపింజల్లా
కొట్టుకొని పోతున్నాం
నీ భీభత్స రసం సుళ్ళు జుట్టుకొని
నురుసులు గ్రక్కుతూ
ఎదురైన వారి నెల్లాతుడిచి పెట్టుకొని పోతున్నది
అమ్మా నీ దయా సముద్ర మిదేనా?
ఇంకే మనాలో తోచదు.